## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016118

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో **భారత ప్రభుత్వపు** సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మంచి బాలుడు

(బాలానందం కథ)

తెలుగు : రచన
ఆకొండ వెంకటేశ్వరరావు

PUBLISHED BY :
VIJAYA PUBLISHERS,
MADRAS-4.

ప్రథమ ము
మే: 195[illegible]

# BEATINEST BOY



*Illustrated by :*
ROBERT HENNE BERGER



***For copies Write to :—***

**VIJAYA PUBLISHERS,
MADRAS-4.**

అమ్మ కంటె కలదె యధికమౌ దైవంబు ?
ప్రాణమిచ్చి పెంచు బిడ్డ నమ్మ;
అమ్మ భువిని యస్మదారాధ్య దైవంబు;
అమ్మ యాత్మ కిద్ది యంకితంబు.

ఈ కథలో—

డేవిడ్ చాలా మంచిపిల్లవాడని అవ్వ చెప్పుతూవుండేది. అవ్వ కూడా చాలా మంచిదనీ, ఎంతో తెలివైనదనీ, ప్రపంచంలో ఉన్న విషయాలన్నీ తెలిసినదనీ డేవిడ్ గ్రహించాడు.

కాని ముందుగా డేవిడ్ ఆ ముసలి అవ్వదగ్గిర ఉండటానికి ఇష్టపడలేదు. ఆ అబ్బాయికి తల్లీ, తండ్రీ లేరు. ఉండటానికి ఇల్లు లేదు. అవ్వ తన మంచితనంతో డేవిడ్‌ను దగ్గిరకు తీసి ఆదరించిన తరువాత డేవిడ్‌కి అవ్వమీద ఎక్కడలేని ప్రేమ, అనురాగం కలగటమే అవ్వలోని గొప్ప విశేషం. డేవిడ్ క్రొత్త విషయాలను తెలుసుకోవడానికి చాలా ఉత్సాహం చూపించాడు. ఎల్లప్పుడూ ఏదో పనిచేసి అవ్వకు సహాయం చేయటానికే ప్రయత్నించాడు. క్రిస్టమస్ పండుగనాడు అవ్వకు మంచి బహుమతి నివ్వాలని నిశ్చయించాడు. ఆమెను ఎంతో ఆనందింపచెయ్యాలని పట్టుపట్టాడు. ఆ బహుమతికి కావలసిన సొమ్మును తానే స్వయంగా కష్టపడి పనిచేసి సంపాదించాలని పంతం పట్టాడు. అంత చిన్నవయసు బాలుడైనా అతని తెలివి తేటల్తో, శ్రద్ధగా పనిచేసి, తన పంతం చెల్లించుకున్నాడు. అవ్వని సంతోషపెట్టాడు. అవ్వ సంతోషంతోనే అతడు బ్రహ్మానందం పొందాడు. ఇదీ ఈ కథా వస్తువు.

వాతావరణం, పాత్రలు, పరదేశీయమైనా, కథావిషయం భావిభారత పౌరులైన ఆంధ్ర బాలబాలికలకు, ఉత్సాహకరమై నీతి బోధనకు, ఉపయుక్తముగానున్నది. కనుక ఈ కథ ఆంధ్ర బాలురకు, బాలికలకు, అమ్మలకు, అవ్వలకు ఆనందదాయకమై, ఆహ్లాదకరమై యలరారునని నమ్ముతున్నాము.

విజయా పబ్లిషర్సు

# కొండమీద కేక

పశువులు మేసే పచ్చిక బయళ్ళలో నుంచి పోయే వంకర టింకర దారిలో, డేవిడ్ అనే కుఱ్ఱవాడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు. ఈ పర్వతం కొనవరకు ఎక్కి అక్కడి, మేఘాలను పట్టుకుంటానని అతడు వాళ్ళ అవ్వ బీవర్లీతో చెప్పాడు. తాను చాలా అలిసి పోయాననీ త్వరగా పోయి పడుకోవాలనీ అవ్వ చెప్పింది. అయితే తానొక్కడే ఒంటరిగా వెళ్ళటానికి అవ్వ అంగీకరించినట్లు డేవిడ్ అనుకున్నాడు.

అవ్వ చాలా చురుకైనదనీ, ప్రపంచ మంతటికి గొప్ప స్త్రీ అనీ డేవిడ్‌కి నమ్మకం. ఆమె ఏ పనినైనా సాధించగలదు. అతని తల్లి దండ్రులు మరణించిన తరువాత అతడామె దగ్గరకి వచ్చినప్పట్నుంచీ ఆమె ఆ కుఱ్ఱవానికి అనేకమైన మంచి విషయాలు నేర్పుతూ వచ్చింది. మొదట ఆ క్రొత్త ముసలమ్మ దగ్గరవుండటం అతని కిష్టం లేకపోయింది. కాని ఇప్పుడు వారిరువురు హాయిగా జీవిస్తున్నారు. వేటాడుట, కోడి పిల్లలను పెంచుట, ఆవులను మేపుట, బంగాళ దుంపలు, వరి

వంటలు వండించుట, త్రవ్వకోల మొదలైన పని ముట్లతో పనిచేయుట మొదలైన పనులను ఆ కుఱ్ఱ వానికి అవ్వ నేర్పింది.

డేవిడ్ ఆమెకు చాలా సహాయకరంగా ఉన్నట్లు అవ్వ సంతోషించి వుంటుంది. నిజానికి అతడు ప్రపంచం అంతలోను ఉపయుక్తమైన కుఱ్ఱవాడనీ, అతడు లేకుండా ఆమెకు గడవదనీ తరుచుగా ఆమె చెప్పలేదూ? అవ్వ ఏమీ హడావిడి మనిషి కాదు. ఆమెకు అనేకమైన మంచి మంచి సంగతులు తెలుసు.

డేవిడ్ క్రమంగా కొండపైకి ఎక్కాడు. అతనిపై పలుచని తెరలాంటి పొగమంచును చూశాడు. అస్త మిస్తున్న సూర్యుణ్ణి కూడా అతడు చూశాడు. ఆ పొగ మంచులో నుంచి అతడు చేతులను పైకెత్తి వెచ్చని సూర్య కిరణాలను అనుభవించాడు. 'నా చెయ్యి మేఘంలో నుంచి దూరిపోయింది' అని అతడు కేక వేశాడు. అక్కడ నుంచి అతడింకా కొంత దూరం పైకి పోయి, తన క్రింద లోయలోని మేఘాలను చూశాడు. అవ్వ కూడా దీన్ని చూస్తే బాగుండును అనుకున్నాడు. నేను చూసినంతలో ఇదే చాలా అందమైనది.

నే నిక్కడ నున్నంత వరకు ఈ చుట్టు ప్రక్కలంతా చూస్తాను అని వేటకాండ్ర దారిలో నడుస్తూన్న డేవిడ్ అనుకున్నాడు. మళ్ళీ అత డక్కడ ఆగి చుట్టుప్రక్కల

నున్న మేఘాలను పరీక్షించాడు. అతని కొక ధ్వని వినిపించినట్లుగా తోచింది. డేవిడ్ చెవి దగ్గిర చెయ్యి పెట్టుకుని శ్రద్ధగా విన్నాడు. నక్కలను వేటాడే కుక్క మూలుగులా వినిపించిం దతనికి. మెల్లగా ఊపిరి పీల్చుతూ ఇంకా శ్రద్ధగా విన్నాడు. అది కుక్క మూలుగు అని అత దనుకున్నాడు. అదిగో ఆ వైపు. ఆ ధ్వని వచ్చిన వైపు కొన్ని అడుగులు వేశాడు. మళ్ళీ ఆగి ఊపిరి బిగపట్టి శ్రద్ధగా విన్నాడు. అది కుక్క మూలుగే నాకు తెలుసు అనుకుని డేవిడ్ ఆ ధ్వని వైపు కొన్ని అడుగులు పరుగెత్తాడు.

'కుక్కా! ఇక్కడ; కుక్కా! ఇక్కడ;' అని అతడు పిలిచాడు.

కుక్క అతనికి సమాధానం ఇవ్వలేదు. మళ్ళీ కుక్క మూలుగు వినాలని డేవిడ్ ఊపిరి బిగపట్టి శ్రద్ధగా చూశాడు. కాని ఏమీ ధ్వని వినిపించలేదు. అందుచేత అతడింకా కొంతదూరం నడిచిపోయి ఒక పెద్ద దూలం ఉన్న చోటికి పోయాడు. ఆ దూలం మీద కూర్చుని మళ్ళీ ఆ ధ్వని వినటానికి ప్రయత్నం చేశాడు. అన్ని వైపులా తెల్లని మేఘాలు నిండుగా వున్నాయి. సూర్యుడు ఆ మేఘాలనించి అస్తమించాడు. ఆ పచ్చని ద్వీపం మీద అతడొక్కడే ఒంటరిగా వున్నాడు. అన్ని వైపులా మేఘాలు ఆవరించి వున్నాయి.

అది ఇంక మళ్ళీ మూలగదు అనుకున్నాడు డేవిడ్. అది ఆ పర్వతం క్రింద నున్న వేటకుక్క. అది ఒక నక్కను వెంటాడింది. అది వెళ్ళిపోయింది. నేనుకూడా వెళ్ళిపోవాలి అనుకున్నా డతడు. బాగా చీకటి పడక ముందే నేనూ వెళ్ళిపోవాలి. చీకటంటే నాకు భయం లేదు. కాని నే నెక్కడా తప్పి పోకూడదని అవ్వ నాకు గట్టిగా చెప్పింది.

అప్పుడు మళ్ళీ అతడు కుక్క మూలుగు విన్నాడు. అది అతనికి క్రింద భాగంనుంచి వచ్చింది.

ఒక గెంతు గెంతి, కుక్క కాదేమో అనుకున్నాడు డేవిడ్. 'కుక్కా! ఇక్కడ, కుక్కా! ఇక్కడ!' అని అతడు పిలిచాడు. కొంచెంసేపు ఊరుకున్నాడు. కాని సమాధానం రాలేదు.

అది ఈ దూలంలో దూరివుండదు అనుకున్నాడు. అప్పు డతడు దూలం కొనకు పరుగెత్తి అది గుల్లగా ఉన్నదేమో అని చూశాడు. కుక్క దూరి పోగలిగి నంత గుల్ల భాగం ఏమీలేనట్లు గ్రహించాడు. అయినా నిశ్చయం చేసుకోవాలని మోకాళ్ళపైన కూర్చొని దూలాన్ని చేతులతో తడమి చూశాడు. అప్పుడొక గంతువేసి అతడు రెండవ కొనవద్దకు పరుగెత్తాడు.

'ఆ! ఇక్కడ గుల్లగా వుంది' అని అరిచాడు. క్రిందికి వంగి అతడా దూలంనుంచి ఒక ముక్కను

తీశాడు. అది పుచ్చిపోయి వున్నట్లు చూసి ఆశ్చర్య పడ్డాడు. అతను చేతులతో ఆ దూలాన్ని పైకి లేవ నెత్తాడు. అక్కడున్న రెండుమూడు కట్టెలను ముక్కలు చేశాడు. 'ఎండిపోయిన ఆకులు' అని అన్నా డతడు. ఆకులమీద చేతులు పెట్టి చూశాడు. 'ఆకులు వెచ్చగా ఉన్నాయి. వానిపై ఏదో నిద్రపోయింది' అనుకున్నా డా కుఱ్ఱవాడు. 'ఆ కుక్క ఇప్పుడే ఈ పక్క మీద నుంచి వెళ్ళిపోయింది. అది మళ్ళీ ఆ దూలం లోపలికి పోయింది.' డేవిడ్ అప్పుడా పుచ్చిపోయిన దూలాన్ని ముక్క ముక్కలుగా చేశాడు. ఆ గుల్ల ప్రదేశం ఉన్నంత వరకు- చివరి వరకు చూశాడు. చివరకి అక్కడ ఒక చిన్న కుక్కపిల్ల నక్కి నక్కి భయ పడుతూ కూర్చుంది. డేవిడ్ దాన్ని పట్టుకోటానికి చేతులు చాపిన కొలదీ ఆ కుక్కపిల్ల మూలుగుతూ, భయంతో వణకిపోయింది.

'ఈ మేఘాలపైకి ఎక్కాలని నా కేదో చెప్పింది. అదేమిటో నాకు తెలీదు. కాని నాకు ఒక కుక్కపిల్ల దొరికింది' అని డేవిడ్ సంతోషంగా అనుకున్నాడు.

ఆ బక్కచిక్కివున్న కుక్క పిల్లను డేవిడ్ దూలం నుంచి పైకి తీశాడు. 'నిన్ను నేనేమీ బాధించను కుక్క పిల్లా! నీవు తిండిలేక మాడిపోతున్నావు. నిన్ను నే నింటికి తీసుకుపోయి అన్నం పెడతాను. నీకు

జ్వరమా? నీ బొచ్చంతా ఊడి పోయింది; ఏమైంది నీకు?' అని అతడు మెల్లగా అడిగాడు.

ఆ కుక్క పిల్ల చర్మమంతా ఎఱ్ఱగా వుంది. రెండు చోట్ల రక్తం కూడా వస్తోంది. 'నీకేం భయం లేదు, కుక్క పిల్లా! నేను నిన్ను పెంచి నీకు చేయవలసిన సహాయం అంతా చేస్తాను. నేనూ, మాఅవ్వా నీకు ఉపచారం చేసి, నీకు ఆరోగ్యం కలిగిస్తాం'అని డేవిడ్‌కుక్క పిల్లను దువ్వుతూ అన్నాడు.

ఆ కుక్క పిల్ల ఒక అడివి జాతిది. డేవిడ్ వద్ద నుంచి తప్పించుకు పోవాలని ప్రయత్నించింది. కాని దానికేం చేయటానికీ శక్తిలేక పోయింది. డేవిడ్ దాన్ని చంకలో పెట్టుకుని కొండ క్రిందికి పరుగు ప్రారంభించాడు. 'నేను నిన్నింటికి తీసుకు పోతున్నాను. ఈ రాత్రి నీకు తియ్యని పాలుపోస్తాను. ఆవు నాకూ, మా అవ్వకీ, ఛార్లీ అనే పందికీ పాలిస్తుంది. ఆమె నీకు కూడా పాలిస్తుంది,' అంటూ డేవిడ్ పరుగెత్తాడు.

అతడు ఆ మంచులోనుంచి పరుగెత్తడంలో ఆ కుక్క పిల్ల జారిపోతుందేమో, మళ్ళీ పట్టుకోలేనేమో, అనుకుంటూ దాన్ని అతి జాగ్రత్తగా పట్టుకున్నాడు. 'కుక్కపిల్లా! నిన్ను ఈ కొండమీద ఎవరు విడిచి పెట్టారు? నక్కల వేటగాళ్ళు విడిచిపెట్టారా? వాళ్ళెందుకు చేశారాపని? ఎందుకంటే-నీ శరీరంమీద బొచ్చు

లేదని? నీవు కూడా ఇదివరలో నావలెనే ఒక అనాథవు. కాని అవ్వ నన్ను పెంచి బట్టలుకొని పెట్టింది. అవ్వ.నీ శరీరం మీద బొచ్చు పెరుగునట్లు చెయ్యగలదేమో కుక్క పిల్లా! మా అవ్వ ఇంచు మించుగా ఎంత పనైనా చెయ్యగలదు!'

డేవిడ్ క్రిందికి దిగి వచ్చే ముందు మలమల మాడుతున్న ఆ కుక్కపిల్లను 'అనాథ' అని పిలిచాడు.



# అవ్వ ఆదరణ

'అవ్వా! అవ్వా! లేలే చూడు నేనేం తీసు కొచ్చానో'
అంటూ డేవిడ్ అవ్వ పడుకున్న గదితలుపుకొట్టాడు.

'అవ్వా! అవ్వా! లే; నేనేం తీసుకు వచ్చానో చూడు'

'ఇదిగో ఒక నిముషం' అంటూ అవ్వ తన పక్క మీాద దొర్లుతూ చెప్పింది.

అవ్వ మంచం ప్రక్కనున్న కుర్చీమీాదనున్న అగ్గి పెట్టెతీసి, కిరసనాయిలు దీపం వెలిగించింది.

'ఇప్పుడు లోపలికి వచ్చి చూపించు' అని చెప్పింది అవ్వ.

డేవిడ్ ఆతెలుపు తెరిచి, చంకలో పట్టుకున్న కుక్క పిల్లతో గదిలోనికి పరుగెత్తాడు.

'ఏమిటది డేవిడ్? ఏం రంగది?' అని అతని చంక లోని కుక్కపిల్లను తీక్షణంగాచూస్తూ అవ్వ అడిగింది.

'నీకళ్ళజోడు పెట్టుకో; బాగాచూడగలవు' అన్నాడు డేవిడ్.

అవ్వ మంచంప్రక్కనున్న కుర్చీమీాదనున్న కళ్ళ జోడు తీసుకుంది. ఆమె నిద్రకళ్లు తుడుచుకొని కళ్ళ జోడు ధరించింది.

'దగ్గరకి తీసుకురా, బాగా చూస్తాను' అంది అవ్వ.

డేవిడ్ మంచం దగ్గరకిపోయి కుక్కపిల్లను చేతులతో ఎత్తి చూపించాడు.

'అది ఒక చిన్నవేటకుక్క, డేవిడ్.' అని ఆమె ముసలిచేతితో దాని నుదుటిపై తట్టుతూ చెప్పింది. 'కాని పాపం! ఆ కుక్కపిల్లను చీడపట్టి తినేసింది. తిండిలేక చావసిద్ధంగా వుంది. ఈ ప్రపంచంలో ఎక్కడ దొరికింది నీకిది డేవిడ్?'

'మేఘాలపైన ఒక గుల్లదూలంలో నాకది దొరికింది' అని అతడు సగర్వంగా చెప్పాడు.

'ఈరాత్రి అక్కడ పైకి వెళ్ళమని ఏదో చెప్పినట్లు నీ వెరుగుదువు కదా! అవ్వా, నీవు కూడా నాతోవచ్చి వుంటే బాగుండేది, ఆపైని మేఘాలపై సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. నేను చూచినంతలో అదే అందంగా వుంది. ఒక కుక్కఅరుపు వినిపించేవరకు నే నక్కడ మేఘాలపై సూర్యకాంతిని చూస్తున్నాను. అప్పుడు నే నాధ్వని వచ్చిన వైపుకే వెళ్ళాను. అవ్వా! ఈ అనాధవున్న దూలం మీాదనే నేను కూర్చున్నాను. నేను ఎలకవలె కదలకుండా కొంతసేపున్న తరువాత మళ్లీ ఆ దూలంలోనే కుక్క మూలుగు వినిపించింది. అది దొరకటం నా అదృష్టం!'

'దానికి 'అనాధ' అనిపేరు పెట్టావా?'

'ఔను, అవ్వా! ఎవరో దాన్ని ఆ పైకొండమీద విడిచి పెట్టారు. ఎవడో నక్కల వేటగాడు అక్కడ దాన్ని విడిచి వుంటాడు అనుకుంటాను. దానికి తల్లీ లేదు, తండ్రీ లేదు. నాకూలేరు. నీవుచేరదీసే వరకు నేనూ అనాధనే కదా! అది కూడా అనాధయే! అందు చేత దానికి నేను ఆపేరు పెట్టాను.'

'అది మంచి వేటకుక్కపిల్ల అని గట్టిగానే చెప్ప గలను. చీడతో చచ్చిపోవాలని ఎవరో దానినక్కడ విడచి పెట్టారు. అందుచేతనే అది నీకు దొరికింది డేవిడ్!'

'దాన్ని మనం రక్షించగలమా అవ్వా?'

'మనం రక్షించగల మేమో అనుకుంటాను. దానికి ముందు కావలసినది తియ్యని, వెచ్చనిపాలు. దాని కున్న చీడను పోగొట్ట టానికి సహాయం చేయుటానికై బోలివర్ టుస్సిని తీసుకొద్దాం. ఈ లోయలో బోలివర్ టుస్సియే గొప్ప వేటకుక్కల వైద్యుడు.'

'అవ్వా! దాన్ని రక్షించ గలమనే నా ఆశ' అని కుక్కపిల్లను వడిలో పట్టుకుని చెప్పాడు.

'నేనులేచి దుస్తులు ధరించే లోగా నీవు వెళ్ళి పొయ్యిలో నిప్పుచెయ్యి. దానికి పాలు కాచాలి. కొద్ది రోజులనుంచి అది ఆహారం తిన్నట్లుగా లేదు.' అని ఆమె చెప్పింది.

'అల్లాగే చేస్తాను, అవ్వా!'

అని అంటూ డేవిడ్ వంట యింట్లోనికి వెళ్ళిపోయాడు. అనాధను క్రిందకుదింపి బొగ్గులను పొయ్యిలో వేశాడు. చిన్నమంట పెరిగి పెద్దదై మండుతున్న కొలదీ డేవిడ్ కట్టెపుల్లలను తెచ్చి మంటలో వేస్తున్నాడు. అవ్వ దుస్తులు ధరించి వంట యింట్లోకి వచ్చేసరికి పొయ్యిలో మంట బాగా మండుతోంది.

'స్టోరు గదిలోనికి పోయి ఒక గ్లాసుపాలు తీసుకురా డేవిడ్!' అనిఅవ్వ చెప్పింది.

డేవిడ్ వంటింట్లోనుంచి పరుగెత్తి ఒక గ్లాసు పాలతో వెంటనే తిరిగి వచ్చాడు. పాలమీాద పైకిలేచిన మీాగడను ఒక పొడవైన చెంచాతో, బీవర్లీ అవ్వ కలియ బెట్టింది. దానిలోనుండి కొంచెం పాలను ఒక గిన్నెలోపోసి దానిని పొయ్యిమీాద పెట్టింది.

'అవ్వా! ఈ అనాధను రక్షించ గలమని నీకు నమ్మకంగా వుందా?'

'నాకు తెలీదు, డేవిడ్. చీడదానికి బాగా పట్టుకుంది. కుక్కకు బొచ్చు ఊడిపోతే దాన్ని రక్షించటం చాలా కష్టం. కాని మనకు చేతనైనంత ప్రయత్నం చేద్దాం.' అనిఅవ్వ చెప్పింది.

'దాన్ని రక్షించ గలమనే నాకు ఆశగా వుంది, అవ్వా!'

డేవిడ్ చేతులలోనున్న, అనాధ నీరసంగా మూలిగింది. 'దాని శరీరంమీద బొచ్చు లేకపోటంచేత ఆ పర్వత శిఖరపు గాలిలో దానికి జలుబుచేసింది. అందుచేతనేఅది ఆ దూలపు తొట్టిలోదూరి కూర్చుంది. పాపం ఇది ఆచలిలో చచ్చినంతగా ముణుచుకొని పోయింది' అని అవ్వ చెప్పింది.

కాగిన పాలలో వ్రేలుపెట్టి అవి తగినంత వేడిగా ఉన్నట్లు అవ్వ గ్రహించింది.

'ఈ రాత్రి నేను దాన్ని చూడక పోయినట్లయితే ఎంతోకాలం ఇది బ్రతికి వుండేది కాదు గదా అవ్వా!'

అవ్వ పాలగిన్నెను క్రిందికి దింపింది. డేవిడ్ అనాధను గిన్నెవద్ద కూర్చోబెట్టి తాను మోకాళ్ళపై కూర్చున్నాడు.

'డేవిడ్ దాని నోటిని పాలకు దగ్గిరగా వుంచు. దానికి వాసన చూపించు' అంది అవ్వ.

ఆ కుఱ్ఱవాడు అనాధనోనిటి పాలకు తగులునట్లు పట్టుకున్నాడు. ముందుగా దానినాలుక పాలను రుచిచూచి, తరువాత ఆ కుక్క పాలను ఎంతో ఆశతో త్రాగటం ప్రారంభించింది.

'అవ్వా! అది తింటోంది. అది తింటోంది.' అని డేవిడ్ కేక పెట్టాడు.

'అదితిన్న తర్వాతనే ఆ కుక్కపిల్ల బాగుంటుంది. చూడు, దాని చర్మం ఎంత బిరుసుగా వుందో.'

దానికి రక్తం కారుతోంది. గిన్నెలోనున్న పాలన్నీ అనాథ త్రాగేసింది.

'అవ్వా! దానికింకా కావాలి' అన్నాడు డేవిడ్.

'ఈ రాత్రికి అవి చాలు. ఇప్పుడే పాలతో దాన్ని ముంచెత్త కూడదు. దానికొక పక్క తయారు చెయ్యి. ఉదయాన్నే మనంపోయి బోలివర్‌ను కలుసుకుందాం' అని అవ్వ చెప్పింది.

'ఈ రాత్రికే వెళ్ళలేమా అవ్వా?'

'ఇప్పుడు వెళ్ళలేము. బోలివర్ ఇప్పుడు నిద్రపోతుంటాడు.'

'అయితే రేపు మనం తెల్లవారు జామునే లేవాలి' అన్నాడు డేవిడ్.

'నీవు వెళ్ళి పండుకుని కొంచెం నిద్ర పోవాలి. ఈ చిన్న అనాథ కూడా ఈ పాలన్నీత్రాగి వెళ్ళి పడుకుని నిద్రపోతుంది.' అని అవ్వ సమాధానం చెప్పింది.

'అవ్వా! ఈ రాత్రికి దాన్ని కూడా మేడపైన నా గదిలో పడుకో బెట్టనా?' అని డేవిడ్ అడిగాడు.

'అల్లాగేచెయ్యి. కాని దానికి పక్కమాత్రం క్రిందనే ఏర్పాటు చెయ్యిసుమా. నీతోపక్క మీద పడుక్కో బెట్టుకోవద్దు. దానికి బాగా బొచ్చు పెరుగునట్లు మనం

బాగా ప్రయత్నం చేద్దాం. అప్పుడు అది అందమైన కుక్కపిల్లగా తయారవుతుంది.' అని ఆమె చెప్పింది.

'అల్లాగే నవ్వా! నా మంచం క్రిందనే దానికి పక్క తయారు చేస్తాను. ఉదయాన్నే మనం దాన్ని బోలివర్ టుస్సీ దగ్గిరకి తీసుకు వెడతాం కదూ' అంటూ డేవిడ్ మేడ మెట్లెక్కడం అరంభించాడు.

అతడు అనాధతో మేడ మెట్లెక్కడం చూస్తూనే, 'అల్లాగే చేద్దాం నాయనా!' అని చెప్పింది అవ్వ.



# డాక్టర్ బోలివర్ టుస్సీ

'పాపం, ఈ చిన్న కుక్క పిల్ల మళ్ళీ రక్తం వచ్చే వరకు తన కాలిగోళ్ళతో గోకుకుంది. చచ్చిపోవా లని ఆ కొండమీద విడిచి పెట్టిన దాన్ని పాపం, నీవు తీసుకొచ్చావు, డేవిడ్' అని క్రిందివైపుకు చూస్తూ అవ్వ చెప్పింది.

డేవిడ్ తన అవ్వ వైపు పైకి చూశాడు. 'అవ్వా, బోలివర్ టుస్సీ దీన్ని రక్షించగలడని చెప్పగలవా' అని అడిగాడు డేవిడ్.

'నాకు తెలీదు డేవిడ్. కాని ఈ లోయప్రాంతంలో ఎవరైనా బ్రతికించ గలవారుంటే ఈ బోలివర్ టుస్సీయే చేయగలడు.'

అవ్వ ధరించిన పొడవైన దుస్తులు దారిలో క్రింద గడ్డి పైనున్న మంచు పైన ఈడ్చు కుంటూ వచ్చింది. డేవిడ్‌తో ఇదివరకు బ్లేకుబర్గుకి పోయి నప్పుడు ఆమె తన గౌనును క్రింద నీడ్చకుండా ఎత్తి పట్టు కునేది. కాని ఇప్పుడు చీడతో దురద పట్టిన అనాధను తన వడిలో పెట్టుకోటం వలన ఆ విధంగా చేయటానికి వీలు లేక పోయింది.

అవ్వ, డేవిడ్ కలిసి ఎత్తైన రాతి కనుమ పైకి నడిచిపోయి, అక్కడ కట్టెలతో కట్టిన బోలివర్ టుస్సీ ఇంటికి చేరుకున్నారు.

'తలుపు కొట్టు, డేవిడ్. బోలివర్ ఇంకా లేచివుండడు. పొగ గొట్టంలో ఏమీ పొగ కనిపించటం లేదు. మనం లేచినంత త్వరగా వాళ్లెప్పుడూ లేవరు.' అని అవ్వ చెప్పింది.

డేవిడ్ వెంటనే, పైన కప్పు లేని ఒక అరుగుపై కెక్కి తలుపు కొట్టి, కాచుకుని వున్నాడు. ఎవరూ రాలేదు. అతడు మళ్ళీ తలుపు కొట్టాడు. కొంచెం సేపు ఊరుకుని డేవిడ్ మూడవసారి మళ్ళీ తలుపు కొట్టాడు. తలుపు తెరచుకుని డేవిడ్ ఎన్నడూ చూడనంతటి ఒక వింత మనిషి వచ్చి నిలబడ్డాడు.

'నీకేం కావాలి అబ్బాయి?' అని ఆ పొడవైన ఎఱ్ఱ ముఖం మనిషి అడిగాడు. అతను నెమ్మదిగా మెల్లని గొంతుతో అడిగాడు. 'ఏమిటీ! ప్రొద్దుటే పక్క మీద నుంచి లేవ గొట్టావు? ఏదో ఎక్కడో పొరపాటు జరిగి వుండాలి. ఈ విధంగా నన్ను పక్క మీద నుంచి లేపితే, ఇంక నాకు తెల్లవారి నిద్ర వుండదు.' అని టుస్సీ తన మాటలకు తానే నవ్వుకున్నాడు. అవ్వ తోట దగ్గిర నక్కలను వేటాడుతున్నప్పుడు డేవిడ్ విన్న

కుక్కల అరుపులాగ మోటుగా పెద్ద ధ్వని చేసినట్లుంది అతని నవ్వు. టుస్సీ డేవిడ్ ముందు నిలబడ్డాడు. అతడు రెండు పైకోట్లు మాత్రం ధరించాడు. సన్నని పొడవైన ఎఱ్ఱని గడ్డం వ్రేలాడుతోంది. తలపై నున్న మెరిసే ఎఱ్ఱని జుట్టు భుజాలపై పడుతూ వ్రేలాడుతోంది. అతని చేతులు పొడవుగా, సన్నంగా మోకాళ్ళదాకా వ్రేలాడుతున్నాయి.

'కొంచెం పొరపాటు జరిగింది,' అన్నాడు డేవిడ్. 'నా కొక కుక్క పిల్ల దొరికింది.' కాని అది చచ్చిన దాని వలె వుంది. నీవు దాన్ని రక్షించగలవేమో అని అవ్వ చెప్పింది.'

'ఓహో! అక్కడ దూరంగా ఉన్న సింతియాను నేను చూడనే లేదే,' అన్నాడు బోలివర్ కళ్లు నలుపుతూ, ఆవలిస్తూ. 'సరే ఆకుక్క పిల్లకు ఏదో ఒకటి చెయ్యాలి. అది వేటకుక్క పిల్ల అయితే మరీ ముఖ్యంగా చూడాలి. ఏదీ నన్ను చూడనియ్యి.'

బీవర్లీ అవ్వ మాట్లాడకుండా ఆ అరుగుపై కెక్కింది. 'వేట కుక్కను రక్షించమని నీవే అంటున్నావా! నా వేటకుక్కలు నీ కోడి గుడ్లను తీసికొని పోయినందుకు నీకు వేట కుక్కలంటేనే అసహ్యం అను కుంటాను.' అన్నాడు బోలివర్.

'కాని, బోలివర్! డేవిడ్ దీని నెంతో ప్రేమిస్తు న్నాడు. నేనుకూడా ప్రేమిస్తున్నాను. కాని వేటకుక్క బాధ పడుతుంటే నేను చూడలేను' అని అవ్వ చెప్పింది.

ఆమె వడిలో పడి నిద్రపోతున్న కుక్కను బీవర్లీకి చూపించింది.

'పాపం, చిన్నపిల్ల' అని మూలుగుతున్న ఆ కుక్క పిల్లను తీసికొని జాగ్రత్తగా ముద్దాడుతూ అన్నాడు. 'నీ కెక్కడ నుంచి వచ్చిందిది? అది ఒక వేటకుక్క బాగానే వుంది. ఇంత చిన్న పిల్లను ఈ విధంగా చేసిన దుర్మార్గుడెవరు?'

'నక్కల వేటగాళ్ళు మంటలు వేసుకునే ఆ కొండ పై భాగంలో దీన్ని చూశాను' అన్నాడు డేవిడ్. 'అది చావటానికి ఒక కట్ట దూలం తొట్టిలో దూరివుండగా నేను చూశాను.'

'అక్కడ విడిచి పెట్టిన ఆ దుర్మార్గుణ్ణి శపిస్తాను' అన్నాడు బోలివర్. 'వేట కుక్కలను అలక్ష్యం చేసిన వారి నెవ్వరినైనా శపించగలను.'

డేవిడ్ ఆచుట్టు ప్రక్కల రక రకాల సైజులలోవున్న ఏడు రంగురంగుల వేట కుక్కలను లెక్క పెట్టి చూశాడు. అవి బాగా మేత మేసి, మంచి ఆరోగ్యంగా

వున్నాయి. అవి అతి గర్వంగా తోకలను ఒకటి, రెండు మెలికలుగా త్రిప్పుకుని వున్నాయి. డేవిడ్ మళ్ళీ బోలివర్ వైపు చూసే సరికి ఎఱ్ఱని తల కాయలతో, తన కంటె చిన్న వారైన ముగ్గురు మగ పిల్లలు బోలివర్ ప్రక్కనే తలువు దగ్గర నిల్చున్నారు. వాళ్ళంతా కాళ్ళకు జోళ్ళు లేకుండా బోలివర్ వలెనే పై చొక్కాలను మాత్రం ధరించి వున్నారు. లోపల గదిలో ఇద్దరు ఆడపిల్లలు, రాత్రిగౌన్లు ధరించి ఇటూ అటూ పరుగెత్తడంకుండా డేవిడ్ చూశాడు.

బోలివర్ వెనక్కి తిరిగి గదిలోనికి చూస్తూ, 'హనీ! నేను మూలికలు త్రవ్వి ఈ కుక్క పిల్లకు మందు తయారు చేయాటానికి పోతున్నాను. వినిపించిందా ?' అన్నాడు.

'బోలివర్ ! నీవింకా ఉదయం ఫలహారం చెయ్యలేదు. జబ్బు వేట కుక్క కోసం ఒక రోజంతా పాడు చేస్తావేగాని, ధాన్యం పండించటానికి కొంచెం కూడా దున్నవు' అంది ఒక స్త్రీ లోపలినుంచి ఆమె డేవిడ్‌కి కను పించటంలేదు.

'హనీ! వేట కుక్క ఎవ్వరినీ బాధించడంలేదు. నేను వెడుతున్నాను.' అన్నాడు బోలివర్.

అక్కడున్న ఒక్క కఱ్ఱల గుడిశలోనికి దూరాడు బోలివర్. కుక్కలన్నీ అక్కడనేలమీద ఓకుచెట్టు ఆకు

లపై పడుకున్న స్థలాన్ని దేవిడ్ చూశాడు. అక్కడ పడివున్న త్రవ్వుగోలను బోలివర్ తీసుకున్నాడు. దానిని త్రవ్వటానికీ కోయటానికీ ఉపయోగించవచ్చు. దానికి ఒక ప్రక్కన గొడ్డలి మాదిరిగా వెడల్పయిన కత్తివలె వుంది. మరియొక ప్రక్కన పదునైన తొలికవలెవుంది.

పొదలు, దుబ్బుల మధ్యనుంచి బోలివర్ కాలిజోళ్లు లేకుండానే వెళ్ళటం దేవిడ్ వింతగా చూస్తున్నాడు. అతడు, అవ్వతోకూడా కాలిజోళ్ళు ధరించి బోలివర్ టుస్సీ వెనుకనే నడిచిపోతున్నాడు.

'మన మిప్పుడొక వనమూలికను వెదకాలి' అన్నాడు బోలివర్. ఎన్నోరకాలైన మూలికలు దొరకాలి మనకిప్పుడు. కొన్ని బెరడులు కూడా కావాలి. మనం త్వరగా ఏదో చేయ్యకపోతే ఆ చిన్న కుక్కపిల్ల చచ్చిపోతుంది.'

'టుస్సీగారూ! మీరు నాకుక్కను బాగు చేసిన తరువాత మీతో కూడా దాన్ని వేటకు తీసికొని రానిస్తారా ? ఈ లోయ ప్రాంతం అంతలోనూ మీరు చాలా గొప్ప వేటగాళ్ళని మా అవ్వ చెప్పింది' అన్నాడు దేవిడ్.

'చెవుల పిల్లిని పట్టుకుని, దాని తోలు టోపీగా చేసుకోవాలని దేవిడ్ కోరిక' అని అవ్వ చెప్పింది.

ఈ అక్టోబరు నెలలో బాగా వర్షాలు పడగానే చెవుల పిల్లిని పట్టుకోవచ్చు. కాని నన్ను బోలివర్

గారు అని మాత్రం పిలవకు. అది చాలా క్రొత్తగా వుంటుంది నాకు. ఊరికే 'బోలివర్' అని పిలిస్తే చాలు నన్ను' అన్నాడు బోలివర్.

మూలికల వ్రేళ్ళ నుంచి మట్టిని దులిపేశాడు బోలివర్. 'సింతియా! నీవు కుక్క పిల్లను డేవిడ్ కిచ్చి, ఈ వ్రేళ్ళను నీ వడిలో వేసుకొని తీసుకు రావాలి' అన్నాడు బోలివర్..

'ఈ వ్రేళ్ళను అనాధ మీద ఇప్పుడే వే.ుువచ్చునా?' అని అడిగాడు డేవిడ్.

'కాదు. ఇప్పుడు కాదు-డేవిడ్!' అంటూ నవ్వాడు బోలివర్. 'మనం ఇంకా అనేకరకాల వ్రేళ్ళను త్రవ్వి, వాటిని ఒక కుండలో వేసి ఉడికించి, ఆ రసాన్ని మాత్రమే అనాధ మీద రాయాలి. దాన్ని 'అనాధ' అని పిలుస్తున్నా వెందుకు చెప్పు?'

'అవ్వ నన్ను పెంచేవరకు నేను అనాధుడను. నేను తెచ్చేవరకు అనాధ కూడ అనాధగానే వుంది' అన్నాడు డేవిడ్.

'అది చాలా బాగుంది! వేటకుక్కకు ఇది సరియైన పేరు' అన్నాడు బోలివర్.

మళ్ళీ బోలివర్ త్రవ్వటం ఆరంభించాడు. 'ఇదిగో మూలిక దొరికింది' అన్నాడు.

· ఆ మొక్క బోలివరుకు మొల ఎత్తు వుంది; పెద్ద, ఆకుపచ్చని ఆకులు కూడా చాలా వున్నాయి.

బోలివర్ చెట్ల క్రింద కొమ్మల క్రింద నడుస్తుండగా, అవి చొక్కా లేని అతని భుజాలకు గీసుకుని ఏమీ గీతలు పడలేదు. అతడు చాలా మోటు మనిషి అని డేవిడ్ తెలుసుకున్నాడు. అతడు గొప్పవేటకాడు అని గట్టిగా చెప్పగలను.. బోలివర్ జోడులేని కాళ్ళతో మొక్కలను, గొప్పలను తన్నుకుంటూ నడుస్తున్నాడు. కాని అతని కాలికి ముళ్లుకూడ గుచ్చుకోలేదు. నేను కూడా బోలివర్ లాగనే అవుతానేమో! అతడు నేనుచూసిన నక్కల బొమ్మవలెనే వున్నాడు. కాని అతడు దయగల మానవుడు. అతన్ని నేను ప్రేమిస్తున్నాను. అతడు వేటకుక్కలను ప్రేమిస్తాడు. నేనూ ప్రేమిస్తాను. అందుచేతనే అతనిపై నాకు ప్రేమ. 'మనకు కావలసిన మూలికలు, వ్రేళ్లు కావలసినవన్నీ దొరికాయి' అని బోలివర్ చెప్పేవరకు వాళ్లు మూలికలను త్రవ్వుతూ, బెరడులను కోసుకుంటూ పోయారు.

'మా యింటికి వెడదాం బోలివర్! మా యింట్లో వ్రేళ్ళను ఉడక బెట్టేలోగా నేను నీకు పలహారం తీసుకొస్తాను.' అని చెప్పింది అవ్వ.

'ఓ. సరే. అదే బాగుంది. నా కిప్పటికి నాతోవేటకి వచ్చే కుఱ్ఱవాడు దొరికాడు. వేటకుక్కకోసం ఏడిచే కుఱ్ఱవాడు చాలా మంచి మనిషి కాగలడు. సింతియా! నాకు నిన్ను నలభై సంవత్సరాలనుంచి తెలుసు. కాని నువ్వు వేటకుక్కను ప్రేమిస్తావని నాకు తెలీదు. నీవు మంచిదానివని నాకు తెలుసు. కాని నేననుకున్న దానికంటె కూడా నీవు మంచిదానవు సుమా' అన్నాడు బోలివర్.

ఆ వసంత కాలమంతా కూడా అవ్వను గురించి బోలివర్ చెప్పిన మాటలను డేవిడ్ జ్ఞాపకం ఉంచుకున్నాడు. అనాధను చూసి నప్పుడల్లా అవ్వమీాద అతనికి ప్రేమఉబికి వచ్చేది. ఆమె అనాధను రక్షించింది. దానికి ఆమె ఋణం తీర్చుకోలే ననుకున్నాడు డేవిడ్. అతనికి అవకాశం దొరికిన తక్షణం ఆమె కిష్టమైన పనిచేయ దలచుకున్నాడు. ప్రపంచం అంత లోను ఆమె చాలా అద్భుతమైన స్త్రీ. మొత్తంమీాద ఆమెనుగూర్చి అతడా విధంగా చెప్పాల్సిందే.

అనాధకున్న చీడను పోగొట్టటానికి బోలివర్ టుస్సీ చేత మందువేయించటం సరియైన పని. త్వరగా చీడం తాపోయి, బొచ్చుబాగా పెరిగి అనాధ ఒక మంచి అందమైన వేటకుక్కగా తయారైంది.

ఆ వసంత కాలంలో అవ్వ అనాధకు త్రాగినంత పాలు పోసింది. కనుక అది బాగా పెరిగింది. ఇంట్లో చేసిన రొట్టె పెట్టింది. వేసవి కాలం పూర్తి అయేలోగా అనాధ, బోలివర్ దగ్గరనున్న వేటకుక్కలవలె తయారైంది. డేవిడ్ వెళ్ళిన చోటకంతా అది అతి గర్వంగా తోక త్రిప్పుకుంటూ అతనితో కూడా తిరుగుతుండేది.

సెప్టెంబరు నెలలో ఆకులు ఎండిపోగానే, డేవిడ్, అవ్వ, బోలివర్‌తో కలిసి అడవిలోకి పోయి అనాధకు తర్ఫీదు నిచ్చారు. అనాధ చాలా మంచి కుక్క అనీ, అతి మంచి వేట కుక్క కాగలదనీ డేవిడ్‌కి అవ్వ చెప్పింది. అవ్వ చెప్పినదంతా నిజమే. బోలివర్ యొక్క వేట కుక్కలకంటే అనాధయే త్వరగా చెవుల పిల్లులను, కనిపెట్ట కలుగుతోంది. అనాధ మొదటి సారిగా అడివి పిల్లిని కనిపెట్టి నప్పట్నుంచీ, అవ్వ, డేవిడ్ కలిసి పిల్లివేట ప్రారంభించారు. రాత్రి వేళలందు అవ్వ అలిసి పడుక్కుంటే డేవిడ్ ఒక్కడే అడివిలోనికి పోతుండే వాడు. చీకటి రాత్రులలో డేవిడ్ వేటాడ దలచుకున్నంత వరకు చంద్రుడు, నక్షత్రాలు ప్రకాసించేవి కాదు. శీతకాలం వచ్చింది. డిశంబరు జరుగు తోంది. కనుక రాత్రుళ్ళు వేటకు తగినట్లుగా ఉండేవి కాదు.

*

# ఆకులు ప్రోగుచేసే కాలం

అది డిశంబరు నెల. ఒక నాడుదయం డేవిడ్ అవ్వ కోసం పాలు తీసుకు పోతుండగా తనలో ఇలా ఆలోచించాడు. త్వరలోనే క్రిస్టమస్ పండుగలొస్తున్నాయి. ఆపండుగనాడు మాఅవ్వ బీవర్లీని ప్రపంచమంతటిలోని స్త్రీలందరి కంటె ఆనందకరమైన గొప్ప స్త్రీగా చెయ్యాలి. నాకు తెలిసినంతవరకు నా విషయంలో ఆమెయేచాలాఅదరంగా వున్నస్త్రీ.ఆమెకు నేనొకఅందమైన బహుమతి నివ్వాలి. అయితే డబ్బులేకుండా నేనేవిధంగా ఆమెకు బహుమతి నివ్వడం? ఇప్పుడున్న డబ్బంతా మా సాధారణ జీవితానికే సరిపోతుంది.

ఈ బహుమతిని గూర్చి డేవిడ్ నవంబరు నెల నుంచీ ఆలోచిస్తున్నాడు. అతడు ఆలోచించిన వాటిలో అవ్వకు మంచి దుస్తులు ఇవ్వాలి అని ఆలోచన ఒకటి. అయితే ఆమెకు కావలసినది నిర్ణయించడం డేవిడ్‌కి తెలీదు. అవ్వ స్వంతంగానే తయారు చేసుకున్న పొడవైన నల్లని కాలికో దుస్తులను ధరిస్తుంది. అక్కడ నివసించేచిన్న యువతులవలె ఆమె దుస్తులు ధరించదు.

పెద్ద కాలరు, మోచేతుల క్రిందివరకు చేతులు గలి గిన దుస్తులే ఆమె ధరిస్తుంది. ఆమెచాలా పొడవుగా వుండటంచేత పెద్దపెద్ద అడుగులు వేస్తూ నడుస్తుంది. దాని కనుకూలంగా వుండేటట్లు దుస్తులు క్రిందివరకు చాలా పొడవుగా వ్రేలాడుతూ వుంటాయి.

ఆ విధంగా ఆలోచిస్తూ అతడు వంటయింటి తలుపు తెరవగానే అతనికి ఆలోచనా భంగం జరిగింది.

'డేవిడ్! ఈ రోజు చాలా ప్రశాంతంగా వుంది. కనుక మనం ఆకుల నేరుకుంటే మంచిది' అని వంటింట్లో నుంచి ఉదయిస్తున్న సూర్యుని వైపు చూస్తున్న అవ్వ చెప్పింది. 'ఢిశంబరు నెలలో ఇంత ప్రశాంతమైన రోజు మరొకటి రాకపోవచ్చు. అవి ఎండుగా ఉన్నప్పుడే ఆకులను ప్రోగు చేసుకోటం మంచిది.'

''అల్లాగే చేద్దాం అవ్వా!'' అన్నాడు డేవిడ్. పెద్ద పాల గిన్నెను వంటింట్లో బల్లపై పెట్టాడు. అతడు పిల్లితోలు టోపీని తీసి, అవ్వ వంట పదార్థాలన్నీ తయారు చేసి పెట్టెలో పెట్టేవరకు అక్కడే చూస్తూ కూర్చున్నాడు.

'పాలుకాచిన వెంటనే వెళ్ళిపోదాం డేవిడ్' అంది అవ్వ, బీవర్లీ.

· అవ్వ ఒకపెద్ద పాత్రలోనికి పాలుపోసే వరకు డేవిడ్ చేతిలో టోపీని పట్టుకుని చూస్తూ నిల్చు న్నాడు. అప్పుడతడు పాలపాత్రను తీసికొనిపోయి స్టోరుగదిలోని ఒకగోడ అరలో పెట్టాడు. మళ్లీ రెండవ పాత్రను తీసుకుపోవటానికి వచ్చిన మనుమణ్ణి చూసి అవ్వ చెప్పింది, 'నీవునేనూ కలిసిపనిచేస్తే డేవిడ్! మన మెంత పనినైనా చెయ్యగలం!'

అవ్వను చూసి చిరునవ్వు నవ్వుతూ డేవిడ్ బల్ల మీదనున్న రెండవ పాలపాత్రను తీసికునిపోయాడు. 'ఔను, చెయ్యగలం అవ్వా! మనమిద్దరం కలిసి చెయ్యలేని పని నా కింతవరకు కనిపించనే లేదు.' అన్నాడు డేవిడ్.

అతడు గదిలోనుంచి తిరిగిరాగానే 'నేను సిద్ధంగా వున్నాను డేవిడ్! మనంధాన్యం గదివద్దకు పోయి ఒకపార, రెండు సంచులు తీసుకుని పోవాలి' అని చెప్పింది అవ్వ.

అవ్వ పెద్దపెద్ద అడుగులు వేస్తూ నడుస్తోంది. కాని ఇప్పుడు డేవిడ్ ఆమెతో సమంగా నడవ గలుగు తున్నాడు. ఒకప్పుడు ఆమెతో సమంగా నడవలేక పరుగెత్తే వాడని అతడికి జ్ఞాపకం వుంది. ఇప్పు డామెతో సరిసమానంగా నడుస్తున్నాడు. వారిద్దరూ

ధాన్యం కొట్టువద్దకు రాగానే డేవిడ్ తలుపుతీసి లోనికి వెళ్ళి రెండు సంచులు, పార తీసుకు వచ్చాడు.

'ఆకులు బాగా వుండే మంచిస్థలమెక్కడ, డేవిడ్?' అని అడిగింది అవ్వ.

'ఆ కొండమీాద ఆ తెల్ల ఓకుచెట్ల క్రింద. కొండ క్రింద చిన్న గొయ్యిలా వుంది. గాలి వల్ల ఆకులన్నీ దానిలోనికి ఆకులు ఎగిరిపడతాయి. అవ్వా! అందులో ఆకులు మొలలోతుంటాయి. అక్కడ ఆకులకోసం మనం ఎక్కువబాధపడ నక్కరలేదు.' అని డేవిడ్సమాధానం ఇచ్చాడు.

'డేవిడ్! నీవు తొందరగా నేర్చుకున్నావు. ఆకులు నిండిన గొయ్యి ఉన్నట్లు కనిపెట్టగలిగావే! అక్కడ గొయ్యి వున్నట్లు నీకెల్లా తెలిసింది.' అంది అవ్వ నవ్వుతూ.

'మొన్న నేను చెవుల పిల్లిని వేటాడుతూ ఆగోతిలో పడ్డాను. మొల వరకూ ఆకులతో మునిగి పోయాను.' అన్నాడు డేవిడ్.

వారిద్దరు చిన్నఏటిని దాటి తెల్లని ఓకు చెట్లవైపు కొండపైకి నడక ప్రారంభించారు.

'మనకు పార అవసరం లేదను కుంటాను అవ్వా!' అన్నాడు డేవిడ్.

'కాని అది కూడా వుంటే బాధించదు కదా. ఏమో ›వసర మౌతుందేమో! గోతిలో ఉన్న వాటికంటె మన తోటకి ఇంకా ఎక్కువ ఆకులు అవసరం కావచ్చు. పైనున్న బాగా ఎండిన ఆకులు ఆవులశాలలో పడ వేద్దాం. ఆవులకు ఎండిన చిగుళ్ళు కావాలి.' అని చెప్పింది అవ్వ.

వారిద్దరూ ఆకుల గొయ్యిదగ్గరకుపోగానే డేవిడ్ దానిలో ఉరికాడు. భుజాల వరకు మునిగి పోయాడు. 'చూడు! ఎంత నిండుగా ఉన్నాయో అవ్వా!' అన్నా డతడు.

డేవిడ్ ఆకులను సంచులలోనికి ఎత్తడం ఆరంభిం చాడు. 'ఉండు, డేవిడ్! నేను సంచిని తెరచి పట్టు కుంటాను.' అని చెప్పింది అవ్వ.

'కాని నీవీగోతిలో దిగలేవు అవ్వా'అన్నాడు డేవిడ్.

'ఓ నేనూ దిగగలను. ఒకరికంటె ఇద్దరు సులభంగా ఆకులతో సంచి నిండింపవచ్చు.' అని చెప్పింది అవ్వ.

ఆకుల కుప్పలోనికి త్రోసుకుంటూ అవ్వ రావడం చూసి డేవిడ్ నవ్వాడు. ఆమె సంచిని తన చేతులతో బాగా తెరచి పట్టుకుంది. ఇప్పుడు సంచిమూతి బాగా విశాలంగా ఉండడంచేత, డేవిడ్ ఆకుల నెక్కువగా అతి సులభంగా సంచిలో పోయగలుగు తున్నాడు.

'అవ్వా! ఆ విధంగా సంచిని తెరచి పట్టుకోగలిగిన వారినింతవరకు చూడలేదు.' అన్నాడు డేవిడ్.

'మీతాతయ్య బీవర్లి, నేనూ కలిసి ఈ విధంగానే ఆకులు ఏరుతుండేవాళ్ళం. ఈ విధంగానే సంచిని పట్టుకోటం నాకతడే చూపించాడు. నీవు సంచిని ఎలా తెరచి పట్టుకునే వాడివి డేవిడ్?' అని అడిగింది అవ్వ. →

'ఒక కొసను నోటితో పట్టుకుని రెండు చేతులతో పట్టుకునేవాణ్ణి.' అని అతడు పెద్ద కుప్పలుగా ఆకులను తెచ్చి సంచిలో వేస్తూ చెప్పాడు. 'బోలివర్ టుస్సీతో వేటకువెళ్ళి చెవుల పిల్లి ని పట్టుకున్న మొదటి రాత్రి అతడు సంచిని పట్టుకోటం నేను కనిపెట్టి చూశాను. పిల్లి ని నేను సంచీలో పడవేయటానికి అతడు అలాగే పట్టుకున్నాడు.'

ఆ తెల్ల టేకుచెట్లకు దట్టంగా పట్టుకుని వున్న ఎండు ఆకులు చేసే ధ్వనితో సమంగా అవ్వ గట్టిగా నవ్వింది.

'నీవు నాకు క్రొత్త సంగతి నేర్పించావు అవ్వా! పళ్ళతో సంచిని పట్టుకోటం నా కిష్టం లేదు. సంచి మురికిగా ఉంటుందేమో. అక్కడ నే నల్లాగే చేశాను. కాని ఇంక నేనెప్పుడూ ఆ విధంగా చెయ్యను' అన్నాడు డేవిడ్.

'నీవూ నాకుకొంతనేర్పించావు. కష్టపడకుండా గాలి చేతనే రాలి ఆకులుదొరికే స్థలంవుందని నాకింతవరకు తెలీదు. మీతాతయ్య కూడా ఈ పనిచాలాసులభంగానే చేసేవాడు. కాని నీపద్ధతి అతనికితెలీదు. మేమిద్దరంఅడవికిపోయిమా కోత కట్టితో ఆకులు రాల్చేవాళ్ళం. చాలా కుప్పలు కుప్పలుగా ఆకులు రాల్చి, తోటలోనికి, సాల లోనికి తీసికుని పోయేవాళ్ళం. కాని ఈ పద్ధతి సులభంగాను, తొందరగాను ఆకులనుముందుగనే రాల్చివుంచుతుంది' అని చెప్పింది అవ్వ.

అవ్వకు తెలియని సంగతిని ఒకటి తానే తెలుసుకున్నందుకు డేవిడ్ చాలా సంతోషించాడు. సంచిలో ఖాళీగానే ఆకులను వేయటంచేత మరియొక్క గుట్ట ఆకులను అతడు సంచిలో వేశాడు. తుపాకి మందులాగ ఈ ఆకులు బాగా ఎండివున్నాయి. 'అవ్వా! డైసీసాలలో పరుపుగా వేయటానికివి చాలా బాగుంటాయి.'

'ఔను. ఈ ఎండు ఆకులపై నిద్రపోటానికి అవు చాలా ఆనందిస్తుంది. ఈ ఎండు ఆకులక్రింద తడి ఆకులుంటాయి. తోటలో చల్లటానికి ఎండు ఆకులకంటె తడివే బాగుంటాయి. రాత్రి గాలివేస్తే తడిఆకులు ఎగిరిపోలేవు.' అని చెప్పింది బీవర్లీ అవ్వ.

అవ్వ, డేవిడ్ కలిసి రెండు సంచుల నిండుగా ఆకులను వేసికొని, కొండఏటువైపుగా క్రిందికిపోతక ప్రారం

భించారు. డిశంబరునెల సూర్యుడు ఆకాశంమీద ప్రకా
సిస్తున్నాడు. గాలి మెల్లగా వెచ్చగా వీస్తూంది. డేవిడ్
తలపై నున్న చెవులపిల్లి టోపీ తోక, భుజంమీదనున్న
ఆకుల సంచీకి పైన గాలిలో ఎగురుతోంది.

'ఆకులు ఏరటానికి సరియైన సమయం ఇదే, డేవిడ్!
రేపు వర్షమైనా, మంచయినా పడవచ్చు. ఇటువంటివి
సంవత్సరంలో ఈ సమయంలోనే సంభవిస్తుంటాయి.
క్రిస్టమస్ పండుగకి ఇక పద్దెనిమిది రోజులే వున్నాయి
కదూ. ఈ పండుగ నీకు చాలా ఆనందకరంగా ఉండా
లని కోరుతున్నాను. నీవు చాలామంచివాడవు, డేవిడ్!
నీవు లేకుండా నేను ఒంటరిగా వుంటే ఏమి చేసివుండే
దానినో నాకు తెలియదు' అని చెప్పింది అవ్వ.

'ఈ క్రిస్టమస్ పండుగ నీకుకూడా చాలఆనందంగా
వుంటుందని ఆశిస్తున్నాను, అవ్వా! నాకు నీవుకూడా
చాలా మంచిగా వున్నావు' అని డేవిడ్ చెప్పాడు.

వారిద్దరూ క్రమంగా గుబ్బపుసాల వద్దకు వచ్చారు.
పంచిలోని ఆకులను డేవిడ్ దైసీ భాగంలోకి పోశాడు.
తరువాత అవ్వ తెచ్చిన సంచికూడా తీసుకుని అతడు
దిమ్మరించాడు. వారాపనులు చేస్తున్నంతసేపూ, క్రిస్ట
మస్ పండుగనుగూర్చి అవ్వచెప్పినమాటలను గురించి
డేవిడ్ ఆలోచిస్తున్నాడు.

మళ్ళీ మరికొన్ని ఆకులు తీసుకుని రావటానికి వారి ద్దరు వెనక్కి వెళ్ళినప్పుడు, 'నేను అవ్వకు ఇవ్వదలచిన బహుమతికి కావలసిన డబ్బు ఎల్లా సంపాదించాలో నాకుతెలుసు'అనుకుంటూ డేవిడ్‌తనచేతిలోని సంచిని ఎగురవేస్తూ నడుస్తున్నాడు. 'దీన్ని గూర్చి నేనిది వరకే ఎందుకు ఆలోచించలేదు? గాలి బాగాలేని నాటి రాత్రి అనాధను అడవికి తీసికుని పోయి సంచి నిండా చెవుల పిల్లులను పట్టుకుని తీసుకొస్తాను. శీఘ్రంగా తోళ్ళను బాగుచేసి, తోళ్ళ దుకాణంలో అమ్మి వేయగల ను. ఇదే అవ్వకు క్రిస్టమస్ బహుమతి యిచ్చేవిధానం. త్వరలోనే మంచి వెచ్చని రాత్రి వస్తుందని నా ఆశ. అటువంటి రాత్రి వచ్చిందంటే అవ్వకి మంచి బహు మతి తప్పకుండా తెస్తాను.'



# పండుగ ఇంకపది హేను రోజులు

భోజనం చేయగానే ఈ రాత్రే వేటకు బాగుంటుంది అని డేవిడ్ అనుకున్నాడు. ఇటువంటి రాత్రిలోనే అడివిపిల్లులు, చెవులపిల్లులు విచ్చలవిడిగా తిరుగుతుంటాయి. నేను ఎదురుచూస్తున్న మంచివెచ్చని రాత్రి ఇదే. ఆనాధతోకలిసి నేను ఈరాత్రి పిల్లులను పట్టుకుంటాను, అని అనుకున్నాడు డేవిడ్.

అతడు భోజనం దగ్గిరనుంచి లేస్తుండగా ఇల్లా చెప్పాడు, 'అవ్వా! నేనువెళ్లాలి.ఈ రాత్రివేటకి చాలా బాగుంది.'

'మనకు వంటయింట్లో కావలసినంత మాసంఉంది డేవిడ్ ! మనకిప్పుడేమీా అడవిమాంసం అవసరం లేదు' అనిచెప్పింది అవ్వ.

'కాని, ఈ రాత్రి వేటకు చాలా మంచిది అవ్వా! భూమితడిగావుండి,రాత్రివెచ్చగా వున్నప్పుడే పిల్లులు బాగా బైట తిరుగుతుంటాయి. గాలిబాగా వీస్తుంటే ఆకుల చప్పుడెక్కువగా వుంటుంది. ఆ చప్పుడికి పిల్లులు చెదిరిపోతాయి.ఈ రాత్రి పిల్లులు చెట్ల మీాదకు

జోరుగా వస్తాయి. చాలా రాత్రులనుంచి అనాథకూడా వేటకు పోవాలని అనుకుంటోంది' అన్నాడు డేవిడ్.

'సరే, నీకు అదృష్టం కలుగుతుంది. నీవు పిల్లిని పట్టుకుంటావనిఆశిస్తున్నాను'అనినవ్వుతూఅవ్వఅంటూ వుండగానే డేవిడ్ లాంతరు తీసికుని వెళ్ళిపోయాడు.

'నీవుకూడా నాతో రావా ? అవ్వా!' అని గౌరవంగా అడిగాడు, డేవిడ్.

'రాను. నేనీరాత్రి రాకుండా వుండటమే మంచిది. నేనిదివరకంత త్వరితంగాకొండలెక్క లేనని భయంగా వుంది. నీతోను, అనాథతోను సమంగా నడవలేనేమో. నేను లేకుండా వుంటేనే మీకు బాగుంటుంది,' అని చెప్పింది అవ్వ.

డేవిడ్ అవ్వవైపుచూసిచిరునవ్వునవ్వి,నేనెందుకు వెడుతున్నానో అవ్వకుతెలిస్తే బాగుండును. కాని ఆమెకు తెలీదు అని తనలో అనుకున్నాడు.

డేవిడ్ లాంతరు పట్టుకోగానేఎందుకో అనాథగ్రహించింది. అది అతనివద్దకు పరుగెత్తుకుంటూ వచ్చింది. ముందుకాళ్లు రెండూ డేవిడ్ చలిబనియను పై పెట్టి అతని ముఖంలోనికి చూస్తూ మూలిగింది. దాన్ని అతడు వేటకుతీసుకు వెడుతున్నందుకు అది సంతోషించింది.

'వేటకు మంచిరాత్రి ఎప్పుడో నీకుతెలుసు కదూ, అనాధ!' అని డేవిడ్ తన వేటకుక్కను ప్రేమగా అన్నాడు.

డేవిడ్ అనాదకు తెల్లగా, పొట్టిగా పెరిగినబొచ్చును చూశాడు. 'అనాధా! ఇక్కడున్న కుక్కలన్నింటికంటే ఇప్పుడు నీవే అందమైనదానివి. నీవే చాలా ఉత్తమ మైన దానవు,' అని అతడు కుక్కతలను దువ్వుతూ అన్నాడు.

డేవిడ్ వైపుచూచి అనాధ మొరిగింది.

'ఇంకఒక్క నిమిషంలో మనంవెళ్ళిపోదాం,అనాధా' అన్నాడు డేవిడ్.

అంటూనే అతడుగదిలోనికిపోయి ఒకకాఫీ సంచిని, ఒకత్రవ్వు గోలను తీసుకుని వచ్చాడు.

'పిల్లి కన్నంలో దూరితే నేనేదాన్ని త్రవ్వి పైకి తీస్తాను, అనాధా! నీపళ్ళతో నీవు మట్టిని, రాళ్ళను త్రవ్వితీయ నక్కరలేదు. నీకు పళ్ళు విరిగిపోతాయి. నీవు బ్రతికినంతవరకు నీకు పళ్ళుండాలి. పళ్ళులేక పోతే నీవు వేటకు పనికిరావు. కుక్కకు పళ్ళూడిపోతే దానిరూపం మారిపోతుంది. అనాధా! పిల్లి చెట్టెక్కిం దంటే నేనే చెట్టెక్కి పట్టుకుంటాను. నేనెల్లా చెట్టెక్కు తానో నీకుతెలుసు అనాధా!' అని తనవేట కుక్కతో డేవిడ్ అన్నాడు.

అతడు చెప్పినదంతా అర్థమైనట్లు అనాథ మొరి గింది. వారిద్దరూ ఇంటినివిడిచి దూరంగా వెళ్ళిన తరువాత మళ్ళీ డేవిడ్ అనాథతో ఇల్లాఅన్నాడు. 'అనాథా! ఈరాత్రి నీవే పిల్లిని కనిపెట్టాలి. నేను వాటిబొచ్చుతోలును తియ్యాలి. వాటిని తీసుకుపోయి బ్లేక్బుబర్గులోని డర్బీప్రొడ్యూస్ హౌసులోఅమ్మి డబ్బు తీసుకోవాలి. దానితో బీవర్లీఅవ్వకి క్రిస్టమస్ పండుగ బహుమతిని కొనాలి. తెలిసిందా ? అనాథా! చూడు, అవ్వముందు మనంమాట్లాడ కూడదు.'

డేవిడ్ ముఖంలోనికి చూస్తూ అనాథ మళ్ళీ మొరి గింది.

'ఇప్పుడుపోయి పిల్లిని వెదుకు. క్రిస్టమస్ పండు గకు ఇంక పదిహేనురోజులుంది. మనంత్వరపడాలి' అన్నాడు డేవిడ్.

అనాథ కాళ్ళు నిగిడించి చీకట్లోకి పరుగెత్తింది. ముక్కుతో గాలిని వాసన చూస్తూ, ఏదో పసి కట్టినట్లుగా పరుగెత్తింది.

అనాథవెళ్ళిన దారినేపోతూ, కుక్క దేనినో కనిపెట్టిం దనుకున్నాడు డేవిడ్. కానికుక్క అతనికికనిపించ కుండావెళ్ళిపోయింది. కొంతసేపటికి అనాథఅరుపువిని పించగానే అతడుఅక్కడే ఆగిపోయాడు. అనాథఅరుపు

ధ్వని, వేగముహెచ్చిన కొలదీ, డేవిడ్ గుండెవేగంగా కొట్టుకుంది.

అతడునిలబడి విన్నకొలదీ పిల్లి కనిపించదని అనుకున్నాడు. క్రమంగా అతడు దగ్గిరకువెడుతున్నాడు. అప్పుడుహఠాత్తుగా అనాధ మొరగటం మానివేసి, తిరిగి మొరగటం ఆరంభించింది. మొరుగుశబ్దంకూడా మారి పోయింది.

'దాన్ని చెట్టు మీదికితరిమింది' అని డేవిడ్ కేకవేస్తూ ఆ శబ్దంవచ్చివైపుకే పరుగెత్తాడు.

పెద్దపెద్ద చెట్లక్రింద మోకాలివరకు గుట్టలుగారాలి వున్నఆకులపైనుంచి పరుగెత్తాడు. కాని అవన్నీతడిగా వుండటంచేత చప్పుడుకాలేదు. ఒకచిన్నఏరునుదాటి, ఒకకంచెపొదవునా పరుగెత్తాడు. అనాధ అరిచే చోటికి చేరుకున్నాడు. అనాధ ఒకచెట్టుమొదలుమీద ముందు కాళ్ళతోఆనుకుని చెట్టుమీదకుచూస్తోంది. అప్పుడు డేవిడ్ లాంతరును పైకెత్తిచూశాడు.

'ఆఁ. నేనుదాన్నిచూశాను, అనాధ! నీవుకూడా చూడవచ్చు. పైనఒకచిన్నద్రాక్ష తీగను పట్టుకుని అక్కడ పెద్దపిల్లి కూర్చుంది. అనాధా! నేనిప్పుడాకొమ్మ నాడించిదాన్నిక్రింద పడకొడతాను. కానిఅది పరుగెత్త టానికిప్రయత్నిస్తే తప్ప, దాన్నినీవు కరవకూడదు సుమా! 'అన్నాడుడేవిడ్.

అనాధ ఊపిరికంటె వేగంగాఅరుస్తోంది. డేవిడ్ ఆ ద్రాక్షతీగనుపట్టుకోగానే దాన్ని అతడేమి చేస్తాడో అనాధకుతెలుసు. డేవిడ్ తీగనుఊపాడు. కాని పిల్లి గట్టిగాపట్టుకునేవుంది. అప్పుడతడుతీగను అతివేగంగా ఊపాడు. అనాధ అరుపుమానివేసింది. పిల్లి బంతిలాగ క్రిందకుపడుతుండటం చూసినడేవిడ్ కళ్ళు నక్షత్రాల వలె మెరిసిపోయాయి. ఆ పిల్లి క్రిందకుపడిన వెంటనే అతడు దానితోకను పట్టుకుని పై కిఎత్తాడు. అందుచేత అనాధ దాన్ని కరవటానికి వీలులేకపోయింది.

'నీవింకా ఆడుతున్నావు పిల్లీ! చెట్టుమీద నుంచి పడినా నీకేమీ దెబ్బ తగులలేదు. పై గా అనాధకూడా నిన్ను కరవకుండా చేశాను.' అన్నాడు డేవిడ్ దాని బరువును చూస్తూ. పిల్లిని కరవాలని అనాధ ఎగిరింది. 'బుద్ధిగావుండు అనాధా! నీవు కరిచి దానితోలును చిల్లు చేయ కూడదు. దీన్ని మంచి బొచ్చుతోలుగా చేయాలి. దీనికి ఒక డాలరు కంటె ఎక్కువ రావాలి. ఇది చాలా బొచ్చుతో వున్న మంచి పిల్లి' అన్నాడు డేవిడ్.

'నీకు క్రిష్టమస్ బహుమతి కొనటానికి ఇదిగో ఒకటి దొరికింది అవ్వా!' అనుకున్నాడు డేవిడ్, ఆపిల్లిని సంచిలో వేస్తూ. 'ఊఁ పరుగెత్తు అనాధ! ఇంకొకదాన్ని

పట్టుకోవాలి. ఈ రాత్రి మనం మూడు పిల్లులను పట్టుకోవాలి. వాటితోళ్ళనుతీసి, శుభ్రపరిచి దర్బీ ప్రొడ్యూస్ హౌస్‌లో అమ్మాలి. మనం త్వరగా వెళ్ళాలి. వెళ్ళు ఇంకొక పిల్లిని పట్టుకో' అన్నాడు డేవిడ్.

అనాథ పరుగెత్తింది. పిల్లి వున్న సంచిపైకి క్రిందికి ఎత్తుతూ, డేవిడ్ దానిబరువును చూస్తున్నాడు. ఇప్పుడింక పిల్లి చచ్చినట్లు నటించటం లేదు. సంచి పైకి ఎక్కుతోంది. డేవిడ్ సంచిని ఆడించి పిల్లిని క్రిందికి పడవేసే సమయంలో అనాథ అరిచింది. ఆశబ్దం వినీ వినగానే డేవిడ్ ఆ వైపుకు పరుగెత్తాడు.

కుక్కను సమీపించే సరికి అది ఒక చిన్న కొండ శిఖరంవైపు చూస్తూ, రాతిక్రిందనే అరుస్తోంది.

'అది పిల్లియే, కాని అనాథా! అది మనకుదొరకదు. అది చాలా చురుకైనది. ఎక్కడ దాక్కోవాలో దానికి తెలుసు' అన్నాడు డేవిడ్.

కాని అనాథ ఆ శిఖరం విడిచి పెట్టలేదు.

'రా, అనాథా! రా. మరియొక చెట్టు వద్దకుపోయి వెదకుదాం. అక్కడ ఏమీరాతి మెట్టలులేవు'అన్నాడు డేవిడ్.

అనాథ డేవిడ్ వద్దకువచ్చి మూలగటం ప్రారంభించింది.

'నీవు పిలుస్తున్నావు అనాధా! మనం పట్టుకోలేని పిల్లిని గూర్చి అరిస్తే లాభంలేదు' అన్నాడు డేవిడ్.

అనాధకు అతని మాటలు అర్థం అయినట్లుంది. అర వటం మానివేసి మళ్ళీ చీకట్లోకి పరుగెత్తింది. ఆనాటి వెచ్చని రాత్రి గాలిని వాసనచూస్తూ అది పరుగెత్తి పోయింది.

అది దేనినో పసికట్టి చూస్తుంది అని అనుకుంటూ అతడు ఒక రాతిమీద విశ్రాంతికై కూర్చున్నాడు. అది ఏమి చేస్తుందో ఆగి చూస్తాను.

ఆ విధంగా అనుకుంటూ డేవిడ్ కొంచెంసేపున్నాడో లేదో అనాధ అరుపు వినిపించింది. ఈ సారి ఆ శబ్దం ఉత్తరపు దిక్కునుంచి వచ్చింది.

ఆ కుక్క పిల్లి దగ్గరకే పోయినట్లుంది అనుకుంటూ అతడు కుక్క అరుపు వచ్చిన వైపుకే పరుగెత్తాడు.

అనాధ అరుపులన్నీ డేవిడ్ చెవికి తీయని సంగీతం లాగవున్నాయి. అతడు ఆ కుక్క ఉన్నచోటికి రాగానే అమితంగా ఆయాసపడుతున్నాడు. కొంచెంసేపు ఆగి ఆయాసపడుతూ కుక్క అరుపులను పరీక్షగావిన్నాడు. ఆ శబ్దం వచ్చిన వైపుకే అతడు పరుగెత్తడం ఆరంభిం చాడు. అతడు చిన్న చిన్న రాళ్ళను దాటుకునిపోతూ మెట్టలెక్కుతున్నాడు. దట్టంగా ఉన్న ద్రాక్షతీగ డొంక లలో నుంచి దూరిపోతున్నాడు. ఆ ప్రాంతంలోని చెట్ల

పై భాగములన్నీ నరికి వేయబడి వున్నాయి. వీటి మధ్యనుంచి అతడు దొమ్చుకుని పోవాలి. చివరికి డేవిడ్ అనాథనుకలుసుకున్నాడు. తనముందుకాళ్ళను ఒక చెట్టు మోడుపై ఆనించి ఆ కుక్క నిలబడివుంది.

డేవిడ్ పైకిచూసి 'ఓహో చూడు! ఎటువంటి పిల్లి వుందో అనాథా!' అన్నాడు సంతోషంతో. ఆ పిల్లి చెట్టు మీదనున్న మొండి కొమ్మపై కూర్చుని వుంది.'ఇది చాలా సులభం అనాథా! నేనాపైకి ఎక్కి దానితోక పట్టుకుని తీసుకొస్తాను.' అన్నాడు డేవిడ్.

అతడు తన లాంతరును విరిగివున్న కొమ్మకు తగిలించి చెట్టుపైన వెలుగు వుండేలాగ చేశాడు. అక్కడ నుంచి అతడు చెట్టుపైకి ఎక్కి పిల్లి తోకను పట్టుకుని తీసుకొచ్చాడు.

'చూడు ఇదిఎంత బాగున్నదో అనాథా!' అన్నాడు. అనాథ పైకిఒక గంతువేసింది. 'ఆఁ దాన్ని నీకియ్యను. అవ్వకు బహుమతి నివ్వటానికిది మరొక బొచ్చుతోలు.' అంటూ డేవిడ్ సంచినివిప్పి ఆ పిల్లిని దానిలో వేశాడు. సంచిలో రెండుపిల్లులు పోట్లాట అరంభించాయి. అవి రెండూసరిగా వుండేటట్లు డేవిడ్ సంచిని ఒక్కమారు ఆడించి, భుజంమీద వేసుకుని తనలాంతరును, త్రవ్వుగోలను తీసికొని అనాథను పిలుస్తూ బయలుదేరాడు.

'ఇంకొక్కటి దొరికితే చాలు అనాధా!' అంటూ, తన కుక్కవైపు చూశాడు. కాని అది అప్పుడే ఎక్కడికో వెళ్ళిపోయింది.

ఏదో తొందరగా వెళ్ళిపోయింది, అని డేవిడ్ అనుకున్నాడు. ఇంతలో తన ముందరవున్న ఖర్జూరపు చెట్టును చూశాడు. కుక్క మరియొక పిల్లి కోసం వెళ్ళిందని డేవిడ్ అనుకున్నాడు.వారక్కడ ఖర్జూరపుపళ్ళను తినటానికి వచ్చారు.

అప్పుడు కుక్క అరుపును విని డేవిడ్ అది ఇంకొక కొండకావల వున్నట్లు గ్రహించాడు. ఆ శబ్దంవచ్చిన వైపునకుబయలుదేరి అతడు తనకడ్డంగావున్న దుబ్బులను, చెట్ల పొదలను, డొంకలను, తీగలను త్రోసుకుంటూ నడుస్తున్నాడు. అతడొక ఎత్తైన గుట్టనెక్కి, మళ్ళీ ఒకలోతైన గోతిలోనికి దిగాడు. ఇక్కడ ఒక మెట్టక్రింద కుక్క మొరుగుతుండటం చూశాడు. ఇది వరకు పిల్లిని పట్టుకున్నచోటికి ఇది నూరు గజాలు మాత్రమే వుంది.

'రా, అనాధా! దాన్నిమనం పట్టుకోలేము.' అన్నాడు డేవిడ్. అనాధ రావటానికి ఒప్పుకోలేదు. కాని డేవిడ్ ఆ మెట్టను ఎక్కుతుండగా అనాధ ఆ మెట్ట విడిచిపోయింది. డేవిడ్ మెట్టపైకి ఎక్కిచూస్తే

ఆకాశంమీద నక్షత్రాలు ప్రకాశిస్తున్నా[illegible] లారెల్ శిఖరానికి నక్షత్రాలు పదిఅడుగుల దూరం మాత్రమే ఉన్నట్లుకనిపించాయి. అతడునక్షత్రాలవైపుఎక్కడం ప్రారంభించాడు. కాని అతడు ఎక్కిన కొలదీ నక్షత్రాలు పైకిపోతున్నాయి.

అతడు లారెల్‌శిఖరం ఎక్కిన తరువాత 'అనాధా! ఇదిఒక పెద్దఅడివి. ఇక్కడమనకు మరొకపిల్లి దొరికి తీరాలి,' అన్నాడు డేవిడ్.

వారిద్దరూ ఆ శిఖరంమీద మైలుకంటె ఎక్కువనడిచారు. అనాధ అన్ని ప్రక్కలకుపోయి వేటాడుతోంది. వారు సల్ఫరు స్ప్రింగు వద్దకు పోయిన తరువాతనే అనాథ ప్రయత్నంచేసింది. అనాధ దట్టమైన ఆ అరణ్యంలోనికిపోయి అరిచింది. మళ్ళీ అది అరుపుమార్చే వరకు డేవిడ్ కనిపెట్టుకుని వున్నాడు.

అతడు మెట్టక్రిందికి పోయేసరికి అనాధ పెద్ద ఓకు చెట్టుపైకి చూసిమొరగటం చూశాడు. ఈ చెట్టు నేనెక్కగలనా?అని అతడు ఆశ్చర్యపడ్డాడు. అతనికినమ్మకం లేకపోయింది.

కాని అతడు కుక్కకు అందకుండా 'ఆ పిల్లుల సంచిని ఒకచెట్టుకొమ్మకు కట్టాడు. లాంతరును తన బెల్టుకుకట్టి తనవీపుపై నిలబడునట్లు అమర్చాడు. అప్పుడతడు ఆపెద్ద ఓకుచెట్టును ఎక్కటం ఆరంభిం

చాడు. ఒకకొమ్మనుంచి మరియొక కొమ్మకు క్రమ క్రమంగా పైకిఎక్కి అక్కడ ఆకులతోకట్టిన ఒకఉడత గూడువున్నట్లు చూశాడు.

ఇది పిల్లి ఎక్కలేనంత పొడవైన చెట్టు అని డేవిడ్ అనుకున్నాడు. క్రమంగా అతడు చిట్టచివరికి ఎక్కి అక్కడ లాంతరును తీశాడు. లాంతరును పైకి ఎత్తి అక్కడ కంగారుగా తిరుగుతున్న వస్తువునుచూశాడు.

అది అడివి పిల్లి కాదు. అది బూడిద రంగుకాదు. అది గోధుమ రంగు, వంటినిండా నల్ల ఉంగరాలను, కుచ్చులాంటి తోకను కలిగివుంది. అది ఒక 'పులుగు వంటి పిల్లి' అని డేవిడ్ కేక పెట్టాడు. ఆ పులుగు పిల్లి నోరు తెరిచి పళ్లు బైట పెట్టింది. అక్కడ నుంచి అది మరొకపెద్ద కొమ్మ నెక్కి చెట్టు కొసకు పోయింది.

నేనా కొమ్మ నెక్కినట్లయితే నా బరువుకి అది విరిగి పోతుందేమో అను కున్నాడు డేవిడ్. నేనిప్పుడే నక్షత్రాలవద్దకు వచ్చినట్లున్నాను. కాని ఆ పులుగుతోలుతో మా అవ్వకు మంచి క్రిస్టమస్ బహుమతి కొన వచ్చు, అని అనుకుంటూ డేవిడ్ పులుగునుచూస్తూ కొమ్మపై కూర్చున్నాడు.

అనాథ పులుగును పసిపట్టటానికిదే ప్రప్రథమం. 'నిన్ను విడిచి వెళ్ళటానికిష్టంలేదు. కాని నేను వెళ్ళక తప్పదు.' అన్నాడు డేవిడ్.

అప్పు డతడు లాంతరును తిరిగి బెల్టుకి తగిలించి క్రిందకుదిగి వచ్చాడు. క్రిందికి రాగానే అతని చేతులు వేడెక్కాయి. చెట్టుకు రాసుకోవడంవలన కాళ్ళు కంది మంటలు పెట్టాయి.

'పులుగు అక్కడ పైన వున్నదిగాని అది నీ అంత పెద్దదిగా వుంది అనాథా! మనం దాన్ని పట్టుకోలేము. ఆ కొమ్మ మీద అది చాలా పైకి పోయింది. నేనెక్కితే ఆ కొమ్మ విరిగి పోతుందేమో అని భయంగా వుంది. నీవు చెబితేగాని నేనెక్కడున్నానో అవ్వ తెలుసు కోలేదు. నావలె నీవు అవ్వతో మాట్లాడలేవు అనాథా,' అన్నాడు డేవిడ్.

కుక్క చెట్టుపైకి చూస్తూ మొరుగుతుంటే అతడు దానితలపై తట్టాడు.

'మనం దాన్ని విడిచిపోవాలి అనాథా! మనం కొన్నాళ్ళతర్వాత మళ్ళీవచ్చి మరొకచిన్నచెట్టుమీద దాన్నిపట్టుకోవచ్చు' అన్నాడతడు.

వారిరువురు సల్ఫర్ స్ప్రింగు క్రిందిలోయలోకి నడచి పోతుండగా, అనాథ డేవిడ్ కంటే ముందు వేగంగా పరుగెత్తిపోయింది. అది పొలాలపై నుంచి పరుగెత్తి పోయి ఒకరెడ్ బడ్ చెట్టుపైకి చూస్తూ మొరిగింది. డేవిడ్

వేగంగా అక్కడకిపోయి చూడగా ఒకపిల్లి అనాధకు అందనంత దూరంలో వ్రేలాడుతోంది. డేవిడ్ పైకి పోయి దాన్ని పట్టుకున్నాడు. కాని అది పులుగు కంటె పెద్దదికాదు. 'నీవుమూడోపిల్లివే. కాని, నీవుచిన్నపిల్లివి సరే.' అన్నాడు డేవిడ్.

తనసంచినివిప్పి ఈచిన్నపిల్లిని కూడా అందులో పడవేశాడు. ఇంక వేటచాలించి ఇంటికి బయల్దేరాడు డేవిడ్. అతనికంటె ముందుగానే ఎఱ్ఱనినాలుక ఆడించుతూ అనాధపరుగెత్తి ఇంటికిచేరింది.



# వేటకాని హృదయం

తోలుకోసమని ఒకచెవులపిల్లి నిచంపటం-అందులోను చిన్న పిల్లి నిచంపటం-గురించి దారి పొడుగునా డేవిడ్ ఆలోచించాడు. మనకు అడివిజంతువుమాంసం అక్కరలేదు. వంటగదిలో కావలసినంత మాంసం వుంది. ఇంతకీ పిల్లి ని అవ్వ తినదు.

ఈ చెవుల పిల్లులు చెట్ల తొఱ్ఱలలో, కొండ మెట్టల పైన, కన్నాలలోను ఎలా జీవిస్తాయో అని ఆలోచించు కుంటూ డేవిడ్ నడిచాడు. అవి రాత్రివేళ ఖర్జూరపు చెట్లు, ద్రాక్షతీగలు మొదలైన చెట్లను వెదకి ఆహారం సంపాదించుకునే పద్ధతిని గూర్చి ఆలోచించాడు. తన భుజంమీద నున్న సంచిని సవరించుతూ అప్పుడప్పుడవి తిండి లేకుండా వుంటాయని ఊహించాడు. చివరికి ఇంటికి వచ్చి సంచిని విప్పి ఆ మూడు పిల్లులను చూశాడు. 'నేను మిమ్మల్ని చంపితే నాకు మీ తోళ్ళు వస్తాయి. తోళ్ళకోసం మిమ్మల్ని చంపటం! నేనీ పిల్లి తోలుటోపీని ధరించినపుడల్లా ఆ రాత్రి బోలివర్ పులుగూను తుపాకితో పేల్చిన సంగతి జ్ఞాపకంవస్తుంది. నా కంటె ఈ పిల్లికే ఈ తోలు ఎంత ఉపయోగమో

అని ఆలోచిస్తాను' అంటూ ఆ పిల్లులతో చెప్పాడు డేవిడ్.

కొంత సేపతడు వాటివైపు చూస్తూ కూర్చున్నాడు.

'ఓ చిన్నపిల్లీ! నిన్ను విడిచిపెట్టేస్తాను. నీ చిన్న తోలుకోసం నిన్ను చంపదలచుకోలేదు. దాని ఖరీదు 25 సెంట్లుండదు. నీవు మళ్ళీ మీ అమ్మ దగ్గరకి వెళ్ళటానికి విడిచివేస్తాను. మిమ్ము నేను చంపదల చుకోలేదు కూడా' అని తనలో అనుకున్నాడు డేవిడ్, తనవైపు భయంగా మెరిసే కళ్ళతో చూస్తున్న పెద్ద చెవుల పిల్లులను చూస్తూ.

'మీ తోళ్ళకోసం మిమ్ము చంపటానికి మా అవ్వ అంగీకరించదు. ఆమెకు బహుమతికై నే నింకొక మార్గం ఆలోచిస్తాను.' అని నిశ్చయించి అతడుసంచిని మళ్ళీ మూసికట్టి భుజంమీద వేసుకున్నాడు.

'ఛీ! ఏమిటిది నా సంగతి నాకేం తెలీటం లేదు' అంటూ తనలో తాను సణిగాడు డేవిడ్.

'పులుగు పిల్లులను చంపటానికి నేను బోలివర్‌కి సహాయం చేశాను. కాని నాకీ ఆలోచనలు రాలేదు. ఇప్పుడు అవ్వకు బహుమతి కొనటానికై పిల్లులను పట్టుకుంటే వాటిచర్మాలు వాటికే ఎంత ఉపయోగమో గదా అని ఆలోచన బయలు దేరింది.'

నేను కొట్టవలసిన దింకా ఒక తేనెచెట్టు వుంది అను కున్నాడతడు. అవ్వకు బహుమతికై కావలసిన ధనం వచ్చేటంత తేనెను అమ్మవచ్చు. సరియైన చోటున ఈ పిల్లులను విడిచిపెట్టి వేస్తాను.

ఒకచోట దట్టమైన ఆకులున్న చెట్టు చూసి డేవిడ్ ఆగిపోయాడు. సంచిని విప్పి అతడొక పెద్ద పిల్లిని తీసి తోకపట్టుకుని మెల్లగా దాన్ని ఆ చెట్టుమీద విడిచి పెట్టాడు. ఆ పిల్లి స్వేచ్ఛగా పైకి ఎక్కి పోయింది. రెండవ పిల్లినికూడ తీసి తోక పట్టుకుని చెట్టుమీదికి విడిచిపెట్టాడు. అటు తరువాత చిన్న పిల్లిని తీసి మెడ వద్ద పట్టుకున్నాడు. దాన్ని చెట్టుపై భాగం వరకు ఎక్కించి చిట్టచివరకి పోవునట్లు చేశాడు.

'ఇప్పుడు నాకు హాయిగా వుంది. అనాధా! రా. ఇంటికి పోదాం' అని తనకు తాను చెప్పుకున్నాడు.

'డేవిడ్! నీవు, నీ అనాధకలిసి ఈ రాత్రి పులుగు పిల్లిని పట్టుకున్నారా?'

'మూడుపిల్లులు.: అనాధ తరిమిపట్టుకున్న పులుగు పిల్ల నేను చూసిన వాటన్నింటికంటె పెద్దది.'

'ఎక్కడ, డేవిడ్!'

'సల్ఫర్‌స్ప్రింగు లోయలోనున్న పెద్ద ఓకుచెట్లలో. అది నాకు దొరకకుండా పైకిపోయింది. కొమ్మ విరిగి పోతుందేమో అని భయం కలిగింది.'

'ఆ(. దానిమీాద నుంచి నీవు పడిపోతే! నిన్ను గురించి నిన్నరాత్రి చాలా బాధపడ్డాను. నేనిల్లా ఆలోచించాను: డేవిడ్‌క ఏమైనా ప్రమాదం జరిగితే నేనేం చెయ్యను? అతడు లేకుండా నేనెల్లా జీవించను? డేవిడ్! నీ వేటనుగూర్చి ఆలోచిస్తూ నా కసలు నిద్ర పట్టనేలేదు'

'నాకు తెలుసు అవ్వా...' అంటూ అతడు ఏదో చెప్పాలని ఆరంభించాడు. కాని పూర్తి చెయ్యలేదు.

'ఔను. నీ అనాధతో బైటకుపోయి వేటాడటమే నీకు చాలా ఇష్టం. నీవు ఒంటరిగా వేటాడటం నీ కిష్టమని నాకు తెలుసు. రాత్రి ఈ అడివిలో నీకు భయంలేదని కూడా నాకు తెలుసు. ఆ విధంగా నీ వుండాలనే నా ఉద్దేశ్యం. కాని నీవు పులుగుకోసం పెద్ద ఓకుచెట్టు చివరికి ఎక్కి కొమ్మ విరిగినంత సాహసంచేయుటం నా కిష్టంలేదు. ఆ కొమ్మ విరిగి క్రిందపడిపోతే ఏమౌతుంది? నిన్ను చూడటానికైనా వీలులేక పోయేది' అని అవ్వ అతని మాటల కడ్డువచ్చి చెప్పింది.

'దాన్ని గురించి క్రిందటి రాత్రి ఆలోచించాను అవ్వా! పులుగును పట్టుకోవాలనుకున్నాను. కాని నేను సాహసించలేదు. నా ప్రాణమును అపాయకర స్థితిలో పెట్టకుండా నేను జాగ్రత్త పడ్డాను' అన్నాడు డేవిడ్.

'నీ పిల్లులను ఏమిచేశావు డేవిడ్?' డేవిడ్ అవ్వ వైపు తిరిగి 'నేను వాటినివిడిచి పెట్టేశాను. ఒకదాన్ని చంపటానికి దాని పీక కొయ్యటమే మార్గంకదా! దాని పీకమీాద ఒక కఱ్ఱనుపెట్టి, రెండువైపుల కాళ్ళతో త్రొక్కిపట్టి తోకను పట్టుకుని లాగాలి.'

'దాన్నిగూర్చి కూడా నేను చాలా ఆశ్చర్యపడ్డాను డేవిడ్! అందుచేతనే మీాతాత బీవర్లీ పులుగుపిల్లిని చంపడు. పిల్లిపీకతీసిన తరువాత అదిప్రాణం కోసం తన్నుకోడం చూడటమంటే అతనికి అసహ్యమని చెప్పాడు మీాతాత'.

'నిన్నరాత్రి అనాధ ఒకచిన్న పులుగుపిల్లిని కని పెట్టింది. దానిచర్మం కోసమై దాన్ని చంపడమా అని ఆలోచించాను. ఇరవై అయిదు సెంట్లకోసం నాకున్న అవసరంకంటె దానిచర్మం దానికెంతో అవసరమని ఆలోచించాను. సంచిలో ఉన్నదాన్ని చూసిఇలా ఆలో చిస్తుంటే, మిగిలిన రెండుపిల్లుల పైనకూడ ఆలోచన పోయింది. ఈ లోయప్రాంతం వారిది కూడా అని అను కున్నాను. అవి ఇక్కడ నివసించి, ఈ ప్రాంతమును ప్రేమిస్తాయి. వాటికి ఆహారం వెతుక్కోటం చాలా కష్ట మైనపని. ఒక్కొక సమయంలో అవి విపరీతంగా ఆకలి బాధ పొడతాయను కుంటాను. ఈ విధంగా ఈ పిల్లు

లను గూర్చి నేననేక రకాలుగా ఆలోచించాను. ఈ విధంగా ఆలోచించటం నాజీవితంలో ఇదే మొదటి సారి' అని అన్నాడు డేవిడ్.

'డేవిడ్ ! నీవు సరియైనపని చేశావు. నిన్ను చూసి నేను గర్విస్తున్నాను. నీవు మీతాత బీవర్లీ వలె చాలా గొప్ప వాడ వవుతావు. నాకు తెలిసినంతలో అతడు చాలా ఉత్తమ పురుషుడు' అని అవ్వచెప్పి సంతోషించింది.



# పండుగ ఇంక పదిరోజులు

ఇప్పుడు నీవు ధాన్యం గదిలోనికిపో అనాధా! ఈ రాత్రి నేను పిల్లులవేటకు వెళ్ళటం లేదు. నేనొక్క చెట్టును కొట్టటానికి వెడుతున్నాను.' అన్నాడు డేవిడ్.

అనాధ గదిలోనికి పోయింది. డేవిడ్ తలుపుమూసి వేశాడు. అప్పుడు అతడు త్వరితంగా ఇంటికి పోయాడు.

'అవ్వా! నీవుపయోగించని పాతగుడ్డ లేమైనా వున్నాయా ?'

'ఉన్నాయి, డేవిడ్! వాటితో నీకేంపని ?'

'తేనెటీగలకు పొగవేయటానికి.'

'డిశంబరునెలలో తేనెచెట్టును కొట్టబోతున్నావా ?'

'ఔను, అవ్వా!'

'వచ్చే వసంత ఋతువువరకు వేచివుండి తేనెటీగలను రక్షించ గలవను కుంటున్నాను.'

'మనకు తోటలో ఇంకా పన్నెండు తేనెపట్లున్నాయి. మనవద్దనేమీ తేనెలేదు.' అని చెప్పాడు డేవిడ్.

'అదినిజమే. మనకు డబ్బుకావలసి వచ్చింది కనుక తేనెను అమ్మివేశాము.' అని చెప్పింది అవ్వ.

సింతియా బీవర్లీ సరుకులపెట్టెలో ప్లేటులను పెట్టుతూ వెనక్కి తిరిగి చూసింది. 'మేడమీద బొం తలుచేయటానికి దాచినపాతగుడ్డలు కొన్నిఉన్నాయి. తీసుకొచ్చి నీకిస్తాను,' అనిఅవ్వ చెప్పింది.

అవ్వ పాతగుడ్డలు తీసుకురావటానికి మేడమీదకు వెళ్ళగానే వంటయింట్లో పొయ్యిపై వ్రేలాడుతున్న లాంతరుని డేవిడ్ తీసుకున్నాడు. చిమ్నీని తీసితడి గుడ్డతో శుభ్రం చేశాడు. పిల్లివేటకు వెళ్ళినప్పుడు గుట్టలమీదనుండి గెంతినప్పుడు లాంతరు వంగి, చిమ్నీకి బాగామసి పారింది.

తేనెటీగలనుంచి తేనెదొంగతనంచేయటానికి, చూచు టకు మంచి లాంత రుండాలి. నేను చెట్టు కొట్టినప్పుడు కాంతి బాగుండటానికి దీపంవత్తి సరిసమానంగా వుం డాలి, అని అతడు ఆలోచించాడు.

అప్పుడు ఒకకత్తెరను తీసుకొని వత్తిని సమంగా కత్తిరించాడు. వంటయింట్లో కఱ్ఱపెట్టె మీద అవ్వ పెట్టిన కిరసనాయిలు డబ్బా నుంచి లాంతరులో కిరస నాయిలు పోశాడు. అవ్వ మేడ మీద నుంచి పాత గుడ్డలు తీసుకు వచ్చేలోగా అతడు లాంతరుని సిద్ధం చేసుకున్నాడు. →

'డేవిడ్! క్రిందటి వేసవిలో మనం తేనె నంతనూ అమ్మి వేయవలసి వచ్చింది. మనకిద్దరకు భోజనంలో

కూడా తేనె ఎంత ఇష్టమో నాకుతెలుసు. తేనెకువచ్చిన డబ్బునుపన్నులకు సరిపోయింది.' అనిచెప్పిందిఅవ్వ.

'అవ్వా! తేనె లేకుండా నేను కాలం గడుప గలను. నీవు దాన్ని అమ్మినప్పుడు నేనేం బాధపడలేదు. మనం పన్నులు చెల్లించాలని నాకుతెలుసు' అన్నాడు డేవిడ్.

'చెట్టు కొట్టటానికి బోలివర్ టుస్సీ నీకు సహాయపడుతున్నాడా?'

'లేదు. నేనే దాన్ని కొట్టబోతున్నాను.'

'అది పెద్దచెట్టుకాదూ!'

'ఔను. కాని నేను దాన్ని కొట్టివేయగలను.'

'నేనూ నీతోవస్తాను, డేవిడ్. మనమిద్దరమూ ఆ చెట్టును రంపంతో కోసి పడవేద్దాం'

'అవ్వా!నేనేఆచెట్టును పడగొట్టి తేనె తీసుకురాగలను నీవురానక్కరలేదు.'

'కొద్ది సమత్సరాల క్రిందట నేనే మీతాత బీవర్లీ కి చెట్టుకొట్టటంలో సహాయంచేసేదాన్ని. ఎప్పుడూ శీతకాలపు ప్రారంభలోనో, అంతంలోనో మేము తేనెచెట్టును కొట్టవలసివుండేది. మేమిద్దరం వెళ్ళి ఱంపంతో దాన్ని కోసి పడకొట్టేవాళ్ళం. అప్పుడు అతడు తేనెటీగలను

తరిమి తేనెను తీస్తూ కొన్ని ఈగకాట్లు తినేవాడు. మీతాత నవ్వేవాడు; నేనూనవ్వేదాన్ని. ఒకనీళ్ళ బాల్చీనిండా తేనె వచ్చేది. ఈరాత్రినేను నీతోవస్తాను డేవిడ్! నేనెల్లాగైనా తప్పకవస్తాను. గ్రీష్మఋతు పుష్పాల్లోనితేనె చాలాబాగుంటుందని అనుకుంటాను!' అని అవ్వచెప్పింది.



# గాలిలో అవ్వ నడక

ఒక అంపము,గొడ్డలి,తేనెటీగలకు పొగపెట్టేది తీసుకు డేవిడ్ ఇల్లు విడిచివెళ్ళాడు. అతని అవ్వ బీవర్లీ లాంతరు, రెండు పెద్దబాల్చీలు, పాతగుడ్డలు పట్టుకుని వెళ్ళింది. చెట్టులోనుంచి తేనెపట్టును కోయటానికి ఆమె ఒక కత్తిని కూడా ఒక బాల్చీలో పడేసింది.

'పొలంలో ఇసుక తిన్నెపై తారాడుతున్న తేనెటీగలివే. అక్కడ దూరంగావున్న కొండమీద ఒక పెద్ద ఓకుచెట్టు తొఱ్ఱలోనికి వాటిని తరిమాను. తేనెపట్టుకు, నేను చూసినంతవరకు అదే సులభమైన చెట్టు. అవ్వా! ఆ చెట్టులో కూడా చాలా తేనెటీగలున్నాయి. ఆ చెట్టు చిటారున ఉన్న కన్నంలోను, బైటా అవి ఒక చిన్న దట్టమైన మేఘంవలె పనిచేస్తుంటాయి.అక్కడకు వచ్చి నట్లైతే ఈగలుకుట్టుతాయి, అవ్వా!' అన్నాడు డేవిడ్ వాళ్ళిద్దరూ ఆ డిశంబరు నెలలో ఒకనాటి రాత్రి నడిచి వెడుతూ.

'తేనెటీగలు నన్ను తరుచుగా కుట్టవు.కుట్టతేమాత్రం ఏం? నన్నిదివరకే కొన్నిసార్లు కుట్టాయి. ఇప్పుడు

మళ్ళీ మరొకసారి కుడితే మాత్రం నాకేం లెక్కలేదు' అని చెప్పింది అవ్వ.

'ఏమన్నావ్ అవ్వా! తేనెటీగలంటే నీకేం భయం లేదని నీ ఉద్దేశ్యమా?' అని అడిగాడు డేవిడ్.

'నన్ను కొంచెంకుట్టినా ఫరవాలేదని అంటున్నాను. డేవిడ్! ఒకసారి నా వ్రేలు వాచిపోయింది. నా పెళ్ళి ఉంగరం పైకి తీయలేకపోయాను. అప్పుడు ఒక తేనెటీగ చేతిమీద కుట్టింది. అబ్బ! ఎంత నొప్పిపెట్టిందో! కాని దానివల్ల నా వ్రేలిమీద వాపుతగ్గి ఉంగరంపైకి వచ్చింది. ఇప్పుడు నాకు కీళ్ళనొప్పులున్నాయి. వ్రేళ్ళ కీళ్ళన్నీ వాచివున్నాయి. ఈ వాపులు తగ్గటానికిప్పుడు నన్ను తేనెటీగలు కుట్టాలి' అని చెప్పింది అవ్వ.

'అరె! తేనెటీగలు కుట్టడం దేనికైనా ఉపయోగం ఉంటుందని నాకు తెలీదు. నీకు చాలా విషయాలు తెలుసు, అవ్వా!'

'అది నిజం, నాయనా! కీళ్ళలో వాపులకు ఈ తేనెటీగలు కుట్టటం చాలా మంచిది' అంది అవ్వ.

అవ్వ లాంతరు ఊపుతూ, పెద్ద అడుగులు వేస్తూ నడుస్తోంది. ఆకాశంమీద ప్రకాశిస్తున్న లక్షలాది నక్షత్రాలు భూమిమీద కాంతిని ప్రసరిస్తున్నాయి. వారిరువుర్థు అతివేగంగా ఆకులులేని అడవిలోనికి ప్రవేశించారు.

'ఇలా వెళ్ళాలి అవ్వా! నా వెనుకనే రా' అన్నాడు డేవిడ్.

అక్కడున్న చెట్లన్నీ చాలా ఎత్తుగా వుండటంచేత వాటి చివరకొమ్మలు నక్షత్రాలకు తగులుతున్నట్లు డేవిడ్ అనుకోటానికి వీలుగావుంది. క్రింద రాలిపోయిన క్రిందటి సంవత్సరపు ఆకులను తన్నుకుంటూ వారు నడుస్తున్నారు. అక్కడక్కడచెట్లకొమ్మలపై ఇరుక్కున్న ఎండు ఆకులు గాలికి క్రిందకు వ్రాలుతూ వారి నెత్తి మీద చప్పుడు చేస్తున్నాయి.

'మనం తెల్ల ఓకు చెట్ల తోటలోకి వచ్చాం అవ్వా! చెట్టు ఇదిగో ఇక్కడేవుంది' అన్నాడు డేవిడ్. కొంద క్రిందికివ్రాలివున్న పెద్దతెల్ల ఓకుచెట్టుదగ్గిరకివెళ్ళాడు. ఆ చెట్టు మ్రానుపై చెయ్యిపెట్టి 'అవ్వా! ఆ చెట్టు ఇదే! ఇదిగో నా చేతివ్రాలు చూడు' అన్నాడు డేవిడ్.

అవ్వ చెట్టు దగ్గిరకి నడిచివెళ్ళి, డేవిడ్ తన గొడ్డలితో వ్రాసిన 'డి' అనే అక్షరం చూసింది.

'ఔను. తేనెపట్టు చెట్టుకు ఆనవాలువేస్తే దాన్నింకెవ్వరూ కొట్టటానికి వీలులేదు. పైగా ఇది మన అరణ్యంలో వుంది, డేవిడ్' అని చెప్పింది అవ్వ.



# తేనెటీగలు - పుష్పాలు

దగ్గిరగా ఉన్న గట్టిచెట్టుకొమ్మను విరిచి, డేవిడ్ తనలాంతరును దాని మోడుకు తగిలించి అక్కడ నుంచి కాంతి తెల్ల ఓకుచెట్టుపై ప్రసరించేటట్లుఏర్పాటు చేశాడు.

'అవ్వా! ఇప్పుడు ఈ చెట్టు కోతకి చాలాగట్టిగా వుంటుంది. దీన్ని కొయ్యటానికి నీవు అంపం పట్ట గలవా చెప్పు' అన్నాడు డేవిడ్.

'తప్పకుండా, డేవిడ్! నేను కొంచెం టైము ఎక్కు వయినా, నీవు కొట్టగలిగిన టైముకంటె తక్కువ టైములోనే మనం దీన్నికోసి వేయగలం' అంది అవ్వ చిరునవ్వు నవ్వుతూ.

అవ్వ, మనుమడు కలిసి చెట్టు మానుకు అడ్డగా అంపం పెట్టారు. అటూ ఇటూ లాగటం ప్రారంభించారు. అంపం ఆడిన కొద్దీ చెట్టు తెగి పొట్టు అధికంగా పడు తోంది. ఒకసారి విశ్రాంతికై అవ్వ ఆగింది. అంపం లాగేటప్పుడు ఆమె తరుచుగా ముందుకు వంగాలి.

కనుక ఆమె లేచి నిలబడి ఆమె వీపుకు విశ్రాంతి నిచ్చింది.

'అవ్వా! నేనిదివరకు అంపం పట్టిన వారందరితో సమానంగానే నీవు అంపం పట్టగలవు. బోలివర్ కంటె నీవే బాగా కోస్తావను కుంటాను.' అన్నాడు డేవిడ్.

'మంచిది డేవిడ్, నేను మీ తాతకు సహాయంచేసే దాన్ని. మేము చెట్లను పడగొట్టి, కట్టెలనుకూడ కొట్టే వాళ్ళం. అదంతా చాల తమాషాగా కూడా వుండేది.' అంది అవ్వ.

త్వరలోనే చెట్టు పెద్దధ్వని చేయటం ఆరంభించింది. మ్రానులో పెద్ద నాటు పడింది. డేవిడ్, అవ్వ-ఇద్దరూ అంపం పైకి తీసి దూరంగా వెళ్ళిపోయారు.

ఆచెట్టు ఇతర చెట్లను త్రోసుకుంటూ క్రింద పడి పోతుండగా చూసి డేవిడ్ 'అవ్వా! అది పడిపోతోంది.' అన్నాడు. చెట్టు, కొమ్మలు రాపిడి చప్పుళ్ళతో వెంటనే దభాలున క్రింద పడింది.

'తేనెటీగలన్నీ కంగారు పడతాయి. వాటి చెట్టు కేం సంభవించిందో వాటికి తెలీదు. చెట్టు ఊపుతో వానికి నిద్ర మెలకువ వస్తుంది. అవి సర్దుకోకుండా పొగ పెట్టెలో గుడ్డలు సర్దుతాను.' అన్నాడు డేవిడ్.

ఆ రాత్రి నిశ్శబ్దంగానున్న చీకటిలో ఈగల కంగారు శబ్దం వినవచ్చింది. అవ్వ, పొగపెట్టెలో గుడ్డలు పెట్టి ఒక అగ్గిపుల్లతో అంటించింది. ఆ పొగ బాగా పైకి వచ్చే వరకు ఆమె అంటించింది. 'ఇదిసిద్ధంగా ఉంది, డేవిడ్! మనకు మంచి అడివి తేనె వస్తుంది' అంది అవ్వ.

'అవ్వా! ఈ చెట్టులో కావలసినంతతేనె ఉన్నట్లుంది. దీనిలో ఎంతైనా ఉండటానికి అవకాశం ఉంది' అన్నాడు డేవిడ్.

'ఒకప్పుడు మీతాత నేను ఒక చెట్టునుంచి తొట్టెడు తేనె తీసినట్లు జ్ఞాపకం. అది చాలాకాలం క్రిందట. అడివినిండా పువ్వులుండి, తేనెటీగలకు కావలసినన్ని పువ్వులున్నప్పుడు సంగతి. అప్పుడు మన మెట్టలు దున్నబడలేదు. నిప్పురాకుండా ప్రజలుకూడా జాగ్రత్తగా ఉండేవారు. తేనెటీగలకోసం విరివిగా పుష్పించే పూలను పాడుచేసే ఒక్క అగ్గిపుల్లను కూడా ఎవరూ వెలిగించ లేదు' అని చెప్పింది అవ్వ.

'నీవు పొగను బాగా పెట్టు. తేనె బాగా వచ్చేలాగ నేను సహాయం చేస్తాను. వాటిని తరువాత నీవు గొడ్డలితో విడతీసినట్లయితే తేనె వృధాగా పోకుండా వుంటుంది. నేను మీ తాతయ్య అల్లాగే చేసేవాళ్ళం' అని అవ్వ చెప్పింది.

'ఔను. కాని నీవు అలసిపోతావేమో అని నా భయం, అవ్వా!' అన్నాడు డేవిడ్.

'ఏం ఫరవాలేదు, డేవిడ్! ఱంపంతో కొయ్యటానికి అది సులభమైన చెట్టు. నేను అలసిపోలేదు' అని చెప్పింది అవ్వ.



# తేనె తీయుట

బీవర్లీ అవ్వ లాంతరుతీసి పొగను పెట్టుతుంటే, అంపము, గొడ్డలిని తీసుకున్నాడు డేవిడ్. వారిద్దరు ఏబది అడుగులపొడవున్న ఆ చెట్టుపొడవునా మెట్టక్రింద కి నడిచారు. 'ఈగలు ఇక్కడున్నాయి, డేవిడ్! చూడు! అదిగోఅవే చాలా ఎక్కువతేనెను తయారుచేసే బంగారు ఈగలు' అని ఆచెట్టు కన్నంలోనుంచి పైకి ఎగురుతూ వచ్చి లాంతరు చుట్టూమూగే ఈగలను చూపిస్తూ అవ్వ చెప్పింది.

అప్పుడు అవ్వ క్రింద తన ప్రక్కనే ఆ లాంతరును పెట్టింది. చెట్టుకన్నంవద్ద పొగనుపెట్టి, చెట్టులోనుంచి ఈగలు వెనక్కి పోవునట్లు పొగవుంచింది, అవ్వ. దీనివల్ల ఈగలు తగ్గుతాయి, అని ఆమె చెప్పింది.

ఈగలు బైటకు రాలేకుండా ఉండేవరకు ఆమె పొగను పెట్టింది. కట్టెలు ఆకులుపెట్టి ఈగలు బైటకు రాకుండా, డేవిడ్ ఆ కన్నం మూసివేశాడు. అప్పు డతడు లాంతరును ఒకచెట్టుకు తగిలించి అవ్వకు, తనకు చెట్టును కొయ్యటానికి తగినకాంతి వచ్చునట్లు చేశాడు.

ఆచెట్టు దూలంలో మూడుచోట్ల వారిద్దరు అంపంతో కోశారు. లోపలనున్న తేనె దొరుకునట్లుగా లోతుగా కోశారు.

'ఇప్పుడు నీవీముక్కలను విడిగా కోయటానికి ముందు నీవు కన్నాలకుపెట్టిన మూతలు తీసెయ్యి, డేవిడ్! నేను మరికొంత పొగపెట్టాలి. లేకపోతే ఒక్కొక్క ముక్కను కొయ్యగానే ఆ ఈగలు మనలను చుట్టి వేస్తాయి,' అని చెప్పింది అవ్వ.

డేవిడ్ ఆ విధంగానే కన్నాలవద్దనున్న ఆకులు, పుల్లలు తీసేశాడు. కంగారు పడుతున్న ఈగల సందడి పూర్తిగా అణిగేవరకూ అవ్వ పొగ బాగాపెట్టింది. అప్పుడు డేవిడ్ దూలంలోని మొదటిముక్కను విడగొట్టాడు.

చెట్టునుంచి ఆ ముక్కను లేవనెత్తుతున్న డేవిడ్‌ను చూసి 'డేవిడ్! నీవు గొడ్డలిని ఉపయోగించు' అని అవ్వ చెప్పింది.

'తేనె! అవ్వా. ఇక్కడ కావలసినంత తేనె!' అని సంతోషంగా అన్నాడు డేవిడ్.

ఈగలు బైటకు రావటంచూచి 'చాలా పొగకూడా వస్తున్నది'అంది అవ్వ.

బీవర్లీ అవ్వ దగ్గిరకివచ్చి పొగబాగాపెట్టి ఈగలను తరిమేసింది.

'అమ్మ! ఈగ నాచేతిమీద కుట్టింది. కాని అది మంచిదే. ఆ చేతిమీద కూడా ఒకటి కుట్టితే బాగుం డును.' అంది అవ్వ నవ్వుతూ.

'ఒకటి నా ఫంట్లాంలో దూరి నన్ను కూడా కుట్టింది' అన్నాడు డేవిడ్. అతడు చెక్కను తిరగతీశాడు. మూడు వరుసలలోతుగా అక్కడ తేనెపట్టువుంది. 'అవ్వా! బాల్చీలు' అని డేవిడ్ కేకవేశాడు.

అవ్వ పొగను పెట్టడం మానివేసి బాల్చీలు డేవిడ్‌కి ఇచ్చింది. మళ్ళీపొగ పెట్టడం అరంభించి ఆమె ఈగ లను తోలేస్తోంది. డేవిడ్ ఆ చెక్కనున్న తేనెను తీసి, తరువాత చెట్టులోనున్న తేనెనుతీయడం అరంభించాడు. ఒకఈగ డేవిడ్‌ను కుట్టినప్పుడు అతడునవ్వుతూ అవ్వకి చెప్పాడు. అవ్వను ఈగ కుట్టినప్పుడు ఆమె నవ్వుతూ డేవిడ్‌తో చెప్పింది.

డేవిడ్ ఈప్రక్కనుంచి బాల్చీనిండుగా తేనెతీశాడు.

'నేను చూచినంతలో ఇదే మంచిరకమైన తేనె' అని చెప్పింది బీవర్లీ అవ్వ. 'డేవిడ్! భోజనంలో ఈతేనెనీకు చాలా బాగుంటుంది. వసంతఋతువు అరంభంలోను, అఖరిదశలోను వచ్చినతేనె పసుపు పచ్చని పూలనుంచి తయారైనది. ఇదిచాలా వింత. కాని వసంత కాలపు అరంభంలోను, అంత్య దశలోను అడవిలో పువ్వులన్నీ

పసుపురంగుగానే వుంటాయి. వాటినుంచి మంచిరకం బంగారు తేనెవస్తుంది.

అప్పుడుడేవిడ్ రెండవ భాగమునుకూడా విడగొట్టి, రెండవబాల్చీనిండా తేనెను తీశాడు. 'ఇంకా కావలసినంత తేనెఉందిఅవ్వా! మనంచాలినన్ని బాల్చీలు తీసుకురాలేదు. ఇప్పుడేంచేద్దాం' అన్నాడు డేవిడ్.

'మనకు అరుగాలన్ల తేనెవచ్చింది. ఇదిమనకు చాలు. మిగిలినదిఈగలకే విడిచివేద్దాం. చెక్కలను మళ్ళీచెట్టుకే నీవు అమర్చవచ్చు,' అనిచెప్పింది అవ్వ.

'ఔను. అట్లాగే అమర్చవచ్చు. అది చాలా మంచి ఆలోచన అవ్వా! నాకెప్పుడూ ఆ ఆలోచనరాలేదు.'

'అందుకనే ఱంపంతోకోయటం మంచిదని చెప్పాను నేను.'

'ఈగలు పోవనుకుంటాను. పోతాయా?'

'పోవు. ఈగలను మనం రక్షించవచ్చు.' అని అవ్వ చెప్పింది.

డేవిడ్ చెట్టుకుచేసిన రెండుకన్నాలను జాగ్రత్తగా మూసి, వాటిని శుభ్రంగా సర్దివేశాడు.

ఇంక రేపువచ్చి ఈ చిల్లులకు మూతలకు బాగా అతుకువేస్తే, వర్షంనీరు లోపలికి పోకుండా వుంటుంది.

నాదగ్గిర అతుకు వెయ్యటానికి మైనంవుంది. చాలా వుంది. శీతకాలంలో ఇక్కడే ఈగలు జీవించ గలవు. వచ్చేవసంత కాలానికి మనం వాటిని తేనెగూళ్ళలో పెట్టి వుంచవచ్చు.

'బలే! అవ్వా! ఇదిచాలా బాగుంది! ఈ ఈగలు పోతాయనే భయంచేతనే ఈచెట్టునుకొట్టదలచుకోలేదు. తేనెచెట్టును కొట్టేవిధానం నీకు బాగా తెలుసుకదూ?' అన్నాడు డేవిడ్.

'ఔను. నాకు చాలాకాలంనుంచి జ్ఞాపకంవుంది. మీతాత, నేనూ ఎట్లా కొట్టేవాళ్ళమో, ఈవిధంగాచెట్టు కొట్టి ఈగలనుఎల్లా రక్షించే వాళ్ళమో అన్నీ నాకు జ్ఞాపకం వున్నాయి. కాని చెట్టు పడిపోయినప్పుడు అది ముక్కలుగా విరిగిపోతే ఈగలను మనం రక్షించి వుండలేక పోయేవాళ్ళము.'

ఈగ కుట్టినచోట నలుపుకుంటూ 'అవ్వా! అయితే ఈ సరుకంతా ఇంటికి తీసుకు వెళ్ళడం ఎల్లాగ?' అన్నాడు డేవిడ్.

'తేనెను, లాంతరును ఇంటికి తీసుకుపోయి, ఇతరపనిముట్లకు రేపురావచ్చు. ఎల్లాగైనా మనం రేపువచ్చి ఈసరుకులకు మూతలు వెయ్యాలి కదా!' అని అవ్వచెప్పింది.



# తేనె డబ్బుకోసం కాదు

డేవిడ్ రెండు తేనె బాల్చీలను పుచ్చుకున్నాడు.

అవ్వ లాంతరును, పొగపెట్టెను పుచ్చుకొంది. బరువైన బాల్చీలను ఊపుకుంటూ డేవిడ్ నడిచాడు. అతని వెనుకనుంచి లాంతరుతో దారి చూపిస్తూ అవ్వ నడిచింది.

"జాగ్రత్త! క్రింద ఏదైనా కాలికితగిలి పడిపోతావేమో డేవిడ్! క్రిందపడి తేనె పారబోయకు. అడుగులు జాగ్రత్తగావెయ్యి.' అని అవ్వచెప్పింది.

'నేనడుగులు జాగ్రత్తగావేస్తాను అవ్వా! నేనురాత్రి వేళ వేటకుపోయి, కొండలు ఎక్కడంలో అడుగులు జాగ్రత్తగావేయటం బాగా అలవడింది' అని డేవిడ్ ఆమెతో అన్నాడు.

'ఈతేనె మనకు చేతికివచ్చేది. ఇదిమనం అమ్మేది కాదు.' అని అవ్వ చెప్పింది.

'అయితే, అవ్వా......' అని డేవిడ్ ఏమో చెప్పబోయాడు.

'ఔను. ఇదిచాలాఎక్కువఅని నాకుతెలుసు. కాని ఇది మనీకుకావాలి. భోజనంలో నీకు తేనెకావాలి. శీత

కాలంలో జలుబుకు నాకు తేనెకావాలి! నీవు ఈచెట్టును కనిపెట్టి ఇంతకాలం జాగ్రత్తగా వుంచినందుకు నాకు చాలాసంతోషం. ఇది భగవంతుని దయవల్ల జరిగింది డేవిడ్! ఈశీతకాలం నాకు దగ్గుకి తేనెకావాలి. మనకు పంచదార లేనిసమయంలో రొట్టెలు చెయ్యటానికి తేనె కావాలి,'అని అతనిమాటకు అడ్డువచ్చి అవ్వచెప్పింది. ←నిర్మలమైనమైదానంలోకి వచ్చేవరకు డేవిడ్‌మారు మాటలాడకుండా తేనె బాల్చీలతోనడిచాడు.అప్పుడక్కడ బాల్చీలను క్రిందపెట్టి విశ్రాంతి తీసుకున్నాడు.

'నిన్ను ఎన్నిచోట్ల ఈగలు కుట్టాయి, అవ్వా!' అని అతడు అడిగాడు.

'ఏడుచోట్ల. నిన్ను?' అని అడిగింది అవ్వ.

'ఐదుచోట్ల'అని డేవిడ్ బాల్చీలను తీసుకున్నాడు.

'మనం ఇప్పుడు తేనెటీగలనుంచి దొంగతనం చేసి నట్లయిందికాదూ డేవిడ్! అడవిలో తేనెటీగలను కని పెట్టడం ఎల్లా నేర్చుకున్నావో ఆలోచించు. నీచేతులతో నీవే చేయగల పనులనుగూర్చి కొంచెం ఆలోచించు. వాటిని చేయటంలో నీకెంతో ఆనందం వుంది. డేవిడ్! నీవు లేకపోతే నేనేమి చేసివుందునో నాకుతెలీదు.' అని చెప్పింది అవ్వ.



# ఇంక ఏడు రోజులు

మూాడురోజులు తరువాత ఒకనాడు మంచుపైన నడుస్తూ ఓర్విల్లేబైర్డ్‌సతికి రెండుబాల్చీలపాలు తీసుకు పోతున్నప్పుడు అవ్వ బహుమానం సంగతి జ్ఞాపకంవచ్చింది. బైర్డ్ సతికి అతడు రోజూ పగలు రాత్రి రెండు ఆవులపాలును పితుకుతాడు. దీనికి అతడు రోజూ ఏబదిసెంట్లను సంపాదిస్తున్నాడు. ఈ సొమ్మును డేవిడ్ అవ్వకిచ్చేస్తుంటాడు. అన్నిసరుకుల ఖరీదు హెచ్చింది. అందుచేత డేవిడ్‌కు, అతనికుక్కకు అవ్వకు ఖర్చు ఎక్కువౌతోంది. అతడు నడిచేదారిలో వున్నమంచు పాదాలకు పట్టుకుంటోంది. ఆకులులేని ఆవిలుచెట్లకొమ్మలనుంచి పరుగెత్తేగాలి మాటలేకుండా పాటలు పాడుతోంది. అవ్వకు దుస్తులుతేలేక పోతున్నానని అతడు ఆలోచించాడు. ఆమెకొక నీళ్ళబాల్చీతేలేను —మాకురెండున్నాయి. ఏమైనా పళ్ళెములు తీసుకు రాలేను. బైర్డుసతి యింట్లో భోజనాల గదిలో చూసిన పళ్ళెముల వంటివి ఎక్కడుంటాయో డేవిడ్‌కి తెలీదు. ఆమె భోజనాలగదిలోనికి అతడు రెండుసార్లు వెళ్ళాడు. ఒకసారి తుపాను వచ్చినప్పుడు ఆమె అతన్ని లోనికి

పిలిచింది. ఒకసారి ఆమెభర్తతో కూడా శలవుమీద ఇతర ప్రదేశానికి వెళ్ళే సమయంలో అతన్ని బైర్డు సతి లోనికి పిలిచి, వారు వూళ్ళో లేనప్పుడు పాలను ఏమి చెయ్యాలో చెప్పింది.

ఆ శీతాకాలపు చలిలో సాయంత్రం డేవిడ్ పాలను తీసుకుపోయి నప్పుడు, బైర్డుసతి వంటయిల్లు తెరచి ఇల్లా చెప్పింది. 'డేవిడ్! నీవు పాలనుపోసిన తరువాత లోపలికిరా. నీవు వెళ్లేముందు నేను నీతో మాట్లాడాలి.'

డేవిడ్ పాలను వెన్న విడతీసే పాత్రలో పోశాడు. గదిలో ఉక్కగా వుండటంచేతను, అతడు చేతిలోనే ఆ పాత్రను త్రిప్పటంవలన అతనికి బాగాచెమటపట్టింది. అప్పుడతడు మామూలు ప్రకారంగా వెన్ననొక పాత్ర లోను, మిగిలిన పాలనొక పాత్రలోను పోశాడు. పాలు విడతీసే పాత్రనుశుభ్రం చేసినతరువాత బైర్డుసతిని చూడటానికి డేవిడ్ లోపలికి వెళ్ళాడు.

'డేవిడ్! నిన్నరాత్రి బైర్డుగారితో నేను మాట్లాడి నప్పుడు, మాకు కట్టె పుల్లలను కొట్టమని నీతో చెప్ప మన్నారు. నీవు మాకు బాగా పనిచేస్తున్నావు. మా ఆవు లను సంరక్షించటంలో, పాలు పితకటంలో నీవు చాలా మంచి వాడవు' అని బైర్డుసతి చెప్పింది.

డేవిడ్ సంతోషిస్తూ 'ఎప్పుడు కొట్టమంటారమ్మా?'

అని అడిగాడు. డబ్బుసంపాదించటానికి ఒక అవకాశం దొరికిందని సంతోషించాడతడు.

'క్రిస్టమస్ పండుగ శలవులయ్యేదాకా కొట్టవద్దు, అని ఆమె చెప్పింది.

'ఓ అల్లాగేనమ్మా' అని డేవిడ్ నెమ్మదిగాచెప్పాడు. అతడు చాలా నిరుత్సాహపడి మాట్లాడనే లేకపోయాడు.

బైర్డుసతి వంటయింట్లో పొయ్యివద్ద కూర్చుంది. ఆమెతొడమీద ఒక గుడ్డముక్క వుంది. డేవిడ్‌కి బాగా తెలిసిన గుడ్డ. ఆమె అతనితో మాట్లాడు తున్నంతసేపూ దానినుంచి దారాలను లాగుతోంది. ఆమె దారాలను లాగుతూ, చివరల ముళ్ళు వేస్తూ ఒకపెద్ద గుడ్డ మీద ఏదో అల్లిక పనిచేస్తోంది. ఆమె దగ్గిరనున్న చిన్న గుండ్రని బల్లమీద కొన్ని అల్లిక నమూనాలున్నాయి.

'బైర్డు సతిగారూ! నేను మిమ్మల్ని అనవసర ప్రశ్న అడుగదలచుకోలేదు. కాని ఆ గుడ్డను నేనెక్కడో చూసి నట్లున్నాను.' అన్నాడు డేవిడ్.

'ఔను నీవు తప్పక చూసివుంటావు. అది ఒక సంచి' అని ఆమె నవ్వుతూ చెప్పింది.

'మీరు ఏమి చేస్తున్నారు' అన్నా డతడు.

'టేబిలు గుడ్డను, రుమాళ్ళను చేస్తున్నాను. ఒక రకమైన రెండు సంచులైతే ఒక టేబిలు గుడ్డ, తొమ్మిది రుమాళ్లు అవుతుంది,' అని చెప్పింది ఆమె.

'అల్లాగా! అవి చాలాబాగున్నాయి. అవి ఎల్లా చెయ్యటమో నేర్చుకోవాలనివుంది.' అని అతడు చెప్ప గానే అమె పనిమానేసి అతని వైపుచూసింది.

'ఒక కుర్చీ తీసుకువచ్చి కూర్చో, నేను నీకు నేర్పు తాను,' అంది ఆమె. నేర్చుకోవాలని అతని కంత ఉత్సాహం వున్నందుకు ఆమె సంతోషించింది.

ఆమె ప్రక్కనున్న ఒక సంచిని తీసి 'చూడు ఈ సంచిని పైకి కుట్టారు. మొదట దానిలో వున్న వదులు దారాలన్నీ తీసెయ్యాలి.' అని ఆమె చెప్పింది.

'ముందు శుభ్రం చెయ్యవద్దా?' అని డేవిడ్ అడి గాడు.

'అల్లాచేస్తే అది అంత సులభంగా రాదు' అందామె.

'వెనకప్రక్కను పైకి త్రిప్పు. ఈ మూలనుంచి ఇప్పటం ప్రారంభించు' అని చెప్పింది ఆమె సంచిని విప్పుతూ.

అతనికి చూపించటానికి సంచిని ఆమె విప్పింది.

'అది చాలా సులభం. నేను చెయ్యగలను'అన్నాడు డేవిడ్.

'తప్పకుండా, చెయ్యగలవు' అని ఆమె నవ్వింది.

డేవిడ్ ఆమె పని బాగా పరీక్షించి చూశాడు. 'సం చికి రెండు ప్రక్కలా అంచులున్నాయి చూడు. వాటిని

చింపివేస్తే దారాలు త్వరగావస్తాయి' అని ఆమె చెప్పింధి.

దారాలూడి పోకుండా ఉండటానికే అంచు అల్లుతారు. తరువాత దారాలు తీయటం, ముళ్ళువేయటం ఆమె చూపించింది. ఒక సంచిని తీసుకొని మూడు సమభాగాలుచేసి, దానిలో ఒకభాగాన్ని మళ్ళీ మూడు భాగాలుగా చేయటం ఆమె చెప్పింది.

'ఆ ధాన్యపు సంచులు రెండు నా కమ్ముతావా?' అని అడిగాడు డేవిడ్. అతని కళ్ళు కలకల్లాడాయి.

'వెళ్ళు. నీవే కావలసిన రెండుసంచులను వెదకి తెచ్చుకో అవి నీకిస్తాను' అని ఆమె చెప్పింది.

'మంచిదమ్మా' అని అతడు అతివేగంగా సంచులకై పరుగెత్తాడు.

వారింట్లో అటువంటి సంచులులేవని డేవిడ్‌కి బాగా తెలుసు. అంతకుముందు ఇటువంటి టేబిలు గుడ్డలు, రుమాళ్ళు అత డెప్పుడూ చూడలేదు. కాని బైర్డు సతి చేసినట్లయితేఅవిచాలాబాగుంటాయని అతనికితెలుసు. ఆమెయిల్లు ఆప్రాంతం అంతకీ అందంగా వుంటుంది. ఆయింటిని చూడటానికి ప్రజలు వస్తుంటారు.

డేవిడ్ ధాన్యం కొట్టుదగ్గరికి వెళ్ళాడు. అక్కడ సంచులున్న పెద్దకఱ్ఱపెట్టెను తెరిచాడు. చాలా అంద

మైనరంగులతో వున్న రెండు సంచులను వెదికితీశాడు. అవి ఓకుచెట్టు ఆకులడిజైనులో వున్నాయి. అవ్వకి, ఆకులురాలిపోయే ఆకురాలుకాలపు రోజులు,ఆకాలపు గాలి చాలాఇష్టం. కనుక ఈరంగులే ఆమెకు చాలా ఇష్టమని అతనికి తెలుసు.

ఆరాత్రి బీవర్లీ అవ్వ నిద్రపోయిన తర్వాత డేవిడ్ దీక్షగా కుర్చొని టేబిలుగుడ్డను, రుమాళ్ళను తయారు చేయటం ఆరంభించాడు. ఇది అతనికి క్రొత్తరకం పని మొదట్లో ఆపని అతనికికష్టంగాను, మెల్లగాసాగింది. దారాలు ముడివేయటంకూడా కష్టమైంది. కాని అతడు పట్టుదలతో పనిచేశాడు. అతడు పనిచేసినకొలది పని సులభమైంది. మూడురాత్రులలో టేబిలు గుడ్డను తయారు చేశాడు. నాలుగు, ఐదు రాత్రులు అవ్వ నిద్రపోగానే డేవిడ్ పనిచేసి ఆరు రుమాళ్ళను తయారు చేశాడు. ప్రతిరోజు అతడు అర్ధరాత్రివరకు పనిచేశాడు. అవ్వ గాఢనిద్రపోవడంచేత డేవిడ్ ఎప్పుడు నిద్ర పోయేవాడో ఆమెకు తెలియలేదు. ఆరవరాత్రి అతడు ఆఖరు మూడురుమాళ్ళను పూర్తిచేశాడు.

'అమ్మయ్య! ఇప్పుడు హాయిగా వుంది' అను కున్నాడు డేవిడ్. అప్పుడతడు వాటిని వంటగదిలోనికి తీసుకువెళ్ళి టేబిలుమీద నున్న నూనెగుడ్డ మీద పరిచాడు.అవంపీటినితప్పకూండా మెచ్చుకుంటుంది'

అనుకున్నాడు డేవిడ్. మర్నాడుదయం డేవిడ్, పాలు పితకడానికై బైర్డుసతి ఇంటికి వెళ్ళినప్పుడు, ఆటేబిలుగుడ్డను, రుమాళ్ళనుకూడా తీసుకువెళ్ళాడు. పాలుపితికి, వెన్న తీసినతరువాత వాటిని బైర్డుసతికి చూపించాడు.

'డేవిడ్! నేను చూచినవాటిలో టేబిలుగుడ్డ రుమాళ్లు చాలా అందంగా వున్నాయి. నీకు మంచి అభిరుచి వుంది. నేను నిర్లక్ష్యంచేసిన సంచులను నీవు ఏరుకున్నావు. అవి ఎంత అందంగావున్నాయో!' అని ఆమె చెప్పి మెచ్చుకుంది.

వాటి నేమిచేయదల్చుకున్నాడో డేవిడ్‌చెప్పినప్పుడు ఆమెకుకళ్ళవెంట నీళ్ళువచ్చాయి. 'ఆమెనిద్రపోయిన తరువాత నీవు వాటిని ఉతికి ఇస్త్రీ చేయనక్కర్లేదు. నేను ఉతికి ఇస్త్రీచేస్తాను. వాటిని బాగాకట్టి, మంచి పెట్టలోపెట్టికూడా ఇస్తాను' అని బైర్డుసతి చెప్పింది.

ఆసాయంత్రం బైర్డుసతి ఇంట్లోపాలను పితికినతరువాత డేవిడ్ తలుపుకొట్టాడు. ఆమెతలుపుతీసి, క్రిస్మస్ పండుగ అలంకారంచేసినపెట్టెను డేవిడ్‌కిచ్చింది. 'ఇదిగో నీకొకచిన్న బహుమానం, డేవిడ్. వెనుకవైపు పందిరిలోని పెట్టెలోఒకపందిపిల్లవుంది. అదిపొట్టిపంది. మా ఆడపంది పదిహేను పిల లుపెటింది. ఆమెపెంచ

గలిగిన వానికంటె ఒకటి ఎక్కువగా వుంది' అని బైర్దుసతి చెప్పింది.

'ఓహో! చాలా సంతోషం, అమ్మా! అవ్వ కీయ. వలసిన బహుమతిని అమర్చి పెట్టడమే నాకు చాలు. కాని క్రిస్టమస్ బహుమతిగా పందికూడా చాలా బాగా వుంది. వచ్చే సంవత్సరం అవ్వపందిని కొనక్కర్లేదు.' అన్నాడు డేవిడ్.

అవ్వకిచ్చే బహుమతిని, పందిని తీసుకొని డేవిడ్ వెళ్ళి పోయాడు. అతడింటికి వెళ్ళగానే ఆ పందిని సాలలో పెట్టి, అవ్వ వంటగదిలో ఉండటంచేత, చల్లగా తనగదిలో దూరాడు. డేవిడ్ తన జీవితంలో ఎప్పుడూ పొందనంత ఆనందం పొందాడు.

ఆ యేటి క్రిస్టమస్ పండుగ దినాలలో ఆ లోయలో ఎన్నడూ లేనంత చలిగావుంది. అడుగు లోతు మంచు వుంది. గాలికి ఎగిరివచ్చిన మంచు ముక్కలు సరి హద్దు తీగలకు తగులుకున్నాయి.

'క్రిస్టమస్‌పండుగ బాగా చేసుకోటానికి మనం బీద వాళ్ళం, డేవిడ్! ఈ క్రిస్టమస్ రాత్రికూడా చాలా చలిగా వుంది' అని అవ్వ నవ్వుతూ చెప్పింది.

'కాని నాకు బైర్దుసతి యిచ్చిన బహుమతిని నీకు రేపు చూపిస్తాను. నేను నిప్పును సరిచేసి ఈ రాత్రంతా

అనుకున్నాడు డేవిడ్. మర్నాడుదయం డేవిడ్, పాలు పితకడానికై బైర్డుసతి ఇంటికి వెళ్ళినప్పుడు, ఆ టేబిలుగుడ్డను, రుమాళ్ళనుకూడా తీసుకువెళ్ళాడు. పాలుపితికి, వెన్న తీసినతరువాత వాటిని బైర్డుసతికి చూపించాడు.

'డేవిడ్! నేను చూచినవాటిలో టేబిలుగుడ్డ రుమాళ్లు చాలా అందంగా వున్నాయి. నీకు మంచి అభిరుచి వుంది. నేను నిర్లక్ష్యంచేసిన సంచులను నీవు ఏరుకున్నావు. అవి ఎంత అందంగావున్నాయో!' అని అమె చెప్పి మెచ్చుకుంది.

వాటి నేమిచేయదల్చుకున్నాడో డేవిడ్‌చెప్పినప్పుడు ఆమెకుకళ్ళవెంట నీళ్ళువచ్చాయి. 'ఆమెనిద్రపోయిన తరువాత నీవు వాటిని ఉతికి ఇస్త్రీ చేయనక్కర్లేదు. నేను ఉతికి ఇస్త్రీచేస్తాను. వాటిని బాగాకట్టి, మంచి పెట్టెలోపెట్టికూడా ఇస్తాను' అని బైర్డుసతి చెప్పింది.

అసాయంత్రం బైర్డుసతి ఇంట్లోపాలను పితికినతరువాత డేవిడ్ తలుపుకొట్టాడు. ఆమెతలుపుతీసి, క్రిస్మస్ పండుగ అలంకారంచేసినపెట్టెను డేవిడ్‌కిచ్చింది. 'ఇదిగో నీకొకచిన్న బహుమానం, డేవిడ్. వెనుకవైపు పందిరిలోని పెట్టెలోఒకపందిపిల్లవుంది. అదిపొట్టిపంది. మా ఆడపంది పదిహేను పిల లుపెటింది. అమెపెంచ

గలిగిన వానికంటె ఒకటి ఎక్కువగా వుంది' అని బైర్డుసతి చెప్పింది.

'ఓహో! చాలా సంతోషం, అమ్మా! అవ్వ కీయ. వలసిన బహుమతిని అమర్చి పెట్టడమే నాకు చాలు. కాని క్రిస్టమస్ బహుమతిగా పందికూడా చాలా బాగా వుంది. వచ్చే సంవత్సరం అవ్వపందిని కొనక్కర్లేదు.' అన్నాడు డేవిడ్.

అవ్వకిచ్చే బహుమతిని, పందిని తీసుకొని డేవిడ్ వెళ్ళి పోయాడు. అతడింటికి వెళ్ళగానే ఆ పందిని సాలలో పెట్టి, అవ్వ వంటగదిలో ఉండటంచేత, చల్లగా తనగదిలో దూరాడు. డేవిడ్ తన జీవితంలో ఎప్పుడూ పొందనంత అనందం పొందాడు.

ఆ యేటి క్రిస్టమస్ పండుగ దినాలలో ఆ లోయలో ఎన్నడూ లేనంత చలిగావుంది. అడుగు లోతు మంచు వుంది. గాలికి ఎగిరివచ్చిన మంచు ముక్కలు సరి హద్దు తీగలకు తగులుకున్నాయి.

'క్రిస్టమస్‌పండుగ బాగా చేసుకోటానికి మనం బీద వాళ్ళం, డేవిడ్! ఈ క్రిస్టమస్ రాత్రికూడా చాలా చలిగా వుంది' అని అవ్వ నవ్వుతూ చెప్పింది.

'కాని నాకు బైర్డుసతి యిచ్చిన బహుమతిని నీకు రేపు చూపిస్తాను. నేను నిప్పును సరిచేసి ఈ రాత్రంతా

మనకు మంట వుండేటట్లు చేస్తాను. ఎన్నడూ లేనంత చలిగా వుంది ఈ రాత్రి' అన్నాడు డేవిడ్.

అవ్వ నిద్ర పోయిన తరువాత డేవిడ్‌కూడా నిద్ర పోతూన్నట్లు నటించాడు. అతడు మేడపైన తన గదికి పోయి, అవ్వ నిద్రపోయినట్లు నిశ్చయమైనంతవరకు వేచివున్నాడు. తరువాత ఆమె గదిలోనికి మెల్లగా చప్పుడు లేకుండా వెళ్ళి, ఆమె పక్కక్రిందనే ఉన్న ఆమె చెప్పులను చూశాడు. ఆ చెప్పుల మీదనే అవ్వ కిచ్చే బహుమతి పెట్టెను డేవిడ్ పెట్టి, చల్లగా వెళ్లి నిద్ర పోయాడు.



# క్రిస్టమస్ పండుగ

మర్నాడుదయం డేవిడ్ నిద్రలేచి నిప్పుచేశాడు. జోరుగా వీచే గాలివలన తలుపులు దబదబ కొట్టుకున్నాయి. వారి పెరటిదొడ్లోవున్న నూతి ప్రక్కనున్న మోడుచెట్ల కొమ్మలసందుల నుంచి పెద్ద ధ్వనులు వచ్చాయి. వారింటివద్ద క్రిస్టమస్ పండుగ, నిజమే. డేవిడ్‌యొక్క మేజోడులో రెండు అరటిపండ్లు, ఒక నారింజపండు, ఒక బెల్లంముక్క ఉన్నాయి. రెండవదానిలో రకరకాల గాజులున్నాయి. క్రిస్టమస్ పండుగ ఉన్నదని తెలిసినప్పటి నుంచీ వీటి కోసమే డేవిడ్ ఎదురు చూస్తున్నాడు.

పొయ్యిలో నిప్పువేసిన తరువాత డేవిడ్ ఆవుకి, కోడి పిల్లలకు మేత వేయటానికి బైటకు వెళ్ళాడు. ఈ వేళ క్రిస్టమస్ పండుగ కనుక అతడు శీఘ్రంగానే మేపుతున్నాడు. అవ్వ లేచి, దుస్తులు ధరించే వరకు ఆమె కవకాశం ఇవ్వాలని అతని ఆశ.

మేతవేసి వచ్చేసరికి ఆ శీతాకాలపు గాలికి డేవిడ్ ముఖం వాడిపోయినట్లుగా మారింది. అతడు ఇంట్లోకి ఒక పెట్టెను తీసుకువచ్చాడు. బీవర్లీ అవ్వ లేచి

దుస్తులు ధరించి మంటదగ్గిర కూర్చుంది. అమె వడిలో టేబుల్ గుడ్డ రుమాళ్ళు వున్నాయి.

'డేవిడ్! చూడు. ఈ అందమైన గుడ్డ రుమాళ్ళు ఎక్కడనుంచి వచ్చాయో. అని ఆశ్చర్యంగా వుంది.' అని ఆమె అంటుండగానే ఆమె కళ్ళవెంబడి నీళ్ళు బుగ్గలపైకి కారుతున్నాయి.

'సంచులనుంచి తయారు చేశాను'అన్నాడు డేవిడ్.

'నా జీవితంలో ఇంత అందమైన వస్తువులను చూడ లేదు. ఈ సంచులనుండి ఇటువంటి టేబులుగుడ్డ, రుమాళ్ళు చేయవచ్చునని ఈ ప్రపంచంలో ఎవరికి బుద్ధి పుట్టింది' అని చెప్పింది అవ్వ.

క్రిస్టమస్‌నాడు చిన్న పిల్లలుబొమ్మలతో ఆడుకున్న ట్లుగా అవ్వఆ టేబులుగుడ్డను,రుమాళ్ళను ముద్దాడింది.

'డేవిడ్! ఆ పెట్టెలో ఏమి వుంది? ఆ కూతను బట్టి అది పందికాదు గదా!' అని అవ్వ అడిగింది.

'అదే అవ్వా! అది బైర్డుదంపతులు మనకు క్రిస్టమస్ కానుకగా ఇచ్చినది. వారి ఆడపంది పదిహేను పిల్లలు పెట్టింది.అది పోషించగల వానికంటె ఒకటి ఎక్కువగా వుంది. అందుచేత పొట్టి పందిని మనకు అమె క్రిస్టమస్ కానుకగా ఇచ్చింది'

'ఓహో! అది చాలా బాగుంది, డేవిడ్!' అని పెట్టె లోని చిన్న తెల్ల పందిని చూస్తూ 'పొట్టి పందులు

మంచి పిల్లలను పెడతాయి. నీ బహుమతులను చూసు
కున్న తరువాత దాన్ని మేపుదాం. అక్కడికి వెళ్ళి
అక్కడ వంట టేబిలుపైన చూడు' అని అవ్వచెప్పింది.

డేవిడ్ వందివున్న పెట్టెను నేలపై ఉంచుతూ 'ఓ,
అవ్వా!' అని పిలిచాడు.

'ఇది వాచీ కాదా, అవ్వా' అన్నాడు.

'ఔను. అది మీ తాత బీవర్లీ వాచి. ఆ బంగారు
వాచీని అతడు నీ కివ్వాలని అనుకోడం నాకు తెలుసు.'
అని చెప్పింది అవ్వ.

డేవిడ్ ఆ వాచీని తీసుకుని జాగ్రత్తగా ఇటు నటు
చూస్తున్నాడు. అప్పుడతడు ఒక కొత్తజత ఫంట్లాలు
తీశాడు.

'ఈ పట్లాంలు, ఆదివారానికి డేవిడ్!' అంది అవ్వ.

డేవిడ్ ఆశ్చర్యంతో మాట్లాడలేక పోయాడు. కళ్ళ
నుంచి నీళ్లు వచ్చినంతగా అతడు ఆనందించాడు.

'నీలాంటి కుమారుడున్నందుకు నే నెంతో గర్విస్తు
న్నాను. నాజీవితంలో ఇదే గర్వించవలసిన సమయం.
నాకిది వరకెన్నడూ తెలీనిసౌఖ్యమును, సంతోషమును
కలిగించావు' అని ఆమె చెప్పింది.

అప్పుడు బీవర్లీ అవ్వ డేవిడ్ దగ్గరకునడిచివెళ్ళింది.

'నీవు వంగో, నాయనా! నిన్ను కౌగిలించుకుని
ముద్దు పెట్టుకోవాలి. ఇప్పుడు నీవు నా కంటె పొడ

వుగా వున్నావు. ఈ లోయలో పెరిగిన వారందరి కంటె నీవు బుద్ధి మంతుడవు.' అనిచెప్పింది అవ్వ.

అవ్వ, డేవిడ్, ఈ క్రిస్టమస్ పండుగ రోజున ఒకరి నొకరు చూసుకున్నప్పుడు అవ్వ కళ్ళలో ఒక క్రొత్త కాంతి ప్రకాశించింది. డేవిడ్ కళ్ళలో కూడా అటు వంటి కాంతే ప్రకాశించి వుంటుంది కదూ! వారిరువురి ఆనందానికి అంతమే లేదు.

